# సమాలోచన




జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 13 | రాజమహేంద్రవరము 16-3-1990, 1-4-1990 | సంచికలు 10, 11


## ఈ సంచికలో



రాబోవు సంచికలో:- 1) నరసరాజు నాటికలు–వ్యక్తిత్వం 2) వేమన దృష్టిలో వనితలు 3) నవ్వని పువ్వు (సమీక్ష) మొదలగునవి ఉంటాయి.


1, 16 తేదీలలో ప్రచురింపబడును.

సంవత్సర చందా రు. 12_00 విడి ప్రతి 0_60 పై.

6 మాసములకు రు. 6_60


సాహిత్యపరమైన రచనలకు సమాలోచన స్వాగతం!

# సంపాదకుని మాట

దేశప్రగతికి ఉపకరించే అనేక విషయాలలో సాహిత్యం స్థానం ముఖ్యమైనదే. విలువైన, నీతిదాయకమైన, ప్రబోధాత్మకమైన రచనలద్వారా సంస్కారాన్ని, విజ్ఞానాన్ని, దేశభక్తిని పెంపొందించి ప్రజలను చైతన్యవంతులుగా చేయడంలో సాహిత్యంయొక్క పాత్ర చిరకాలంనుంచి అందరూ తెలుసుకున్నదే.

సమాజంలో మనిషికి ఉండే స్థానం చాలా విలువైనది. ఆ విలువను నిలుపుకోవడంకోసం మనిషి అవసరమైతే స్వసుఖాన్ని విడనాడుకుని స్వార్థరహితంగా ఉండాలి. వ్యక్తిశ్రేయస్సు, సంఘశ్రేయస్సు, దేశ సౌభాగ్యం ప్రజల నైతికప్రవర్తనమీద, మనోసంస్కారంమీద ఆధారపడి ఉంటాయని చెప్పనక్కరలేదు. మన పురాణాలు, ఇతిహాసాలు అన్నీకూడా ప్రబోధాత్మకంగాను మార్గదర్శకంగాను ఉండడం మన భారతీయుల పుణ్యవిశేషం.

ఏ మతమైనా, ఏ కులమైనా మనమంతా భారతీయులం. ప్రపంచ చరిత్రలో మనకున్న స్థానం విశిష్టమైనది. ఏ కులమైనా ఏ మతమైనా మంచి వినమని, మంచి చేయమని చెబుతుంది.

సాహిత్యం పోషించడంలో పత్రికల పాత్ర బహువిశిష్టమైనది. కేవలం వ్యక్తి స్వార్థంతోనో, ధనాపేక్షతోనో, రాజకీయ ప్రయోజనాలకోసమో పత్రికల్ని ఉపయోగించుకోవడం కాని– పత్రికలు అటువంటి స్వార్థపరులకు అండగా నిలవడంకాని ఎంతమాత్రం వాంఛనీయం కాదు. అలాంటిదే జరిగితే ప్రజలు వివేకంతో వాటిని సరిదిద్దాలి.

విజ్ఞానదాయకమూ, ప్రబోధాత్మకమూ అయిన రచనలు చేసి రచయితలు మా ఈ చిన్నపత్రికకు మార్గదర్శకం అవుతారని ఆశిస్తున్నాము.

ధనాపేక్ష లేకుండా సాహిత్యపోషణకు ఒక చిన్న కారణం కావాలని ఆశించిన ఒక మహనీయుని ఆశయంతో స్థాపింపబడినది ఈ చిన్నిపత్రిక– ఈ పత్రికను మీఆదరాభిమానాలతో ఆరోగ్యంగా బ్రతుకనివ్వమని కోరుచున్నాము.

ఈ ఉగాది మనందరకు శుభదాయకమూ, శ్రేయోదాయకమూ కావాలని కోరుతున్నాము.

—సంపాదకుడు

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

**Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.**


---

## భక్తకవి, నాదయోగి
## 1. శ్రీ జవంగుల యల్లమంద దాసుగారి రచనలు – ఒక పరిశీలన

శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసు గారి పేరు వినని హరికథా ప్రియులు ఆంధ్ర లోకమున బహు అరుదు. వారి శిష్యులే శ్రీ జవంగుల యల్లమంద దాసుగారు. వీరిని జయదాసురెడ్డి అని కూడా వ్యవహరించుట కలదు. సంప్రదాయ బద్ధమైన నియమ నిష్ఠలతో కూడిన జయదాసుగారి రచనలు సహజముగానే భక్తితో తళ తళ మెరయుచున్నవి. ప్రత్యక్షరము నందు అనుక్షణ నవీనత్వము వారి రచనలలో మెరుసులెత్తుచున్నది. వీరు సంస్కృతాంధ్రముల యందు పేర్కొనదగిన పాండిత్యము సంపాదించి ఆంధ్రమున, సంస్కృతమున సాహిత్య వ్యవసాయము కొనసాగించిరి. వీరు ఒంగోలు వాస్తవ్యులు. వృత్తిరీత్యా వీరు అధ్యాపకులు.

శ్లోకరచన వీరికి వెన్నతో పెట్టిన విద్య. కీర్తనరచనము వీరికి కరతలామలకము. పద్యము వీరికి అమునకు దాసి. హరికథలు వీరు వ్రాసినవి రెండు ఇటీవలనే ముద్రింపబడినవి. ఈ కవి నూటికి నూరుశాతము శుద్ధ సాత్త్వికుడు. నాదయోగము నభ్యసించుచు సరస్వతీ మాత కటాక్షమునకు పాత్రులైన వీరు భక్తి ప్రపూరితమైన రచనలనే ఎక్కువగా వెలువరించినారు. ఆధ్యాత్మిక చింతనతో కూడిన వీరి రచనలలో ఛందస్సు విశేష గతులతో ప్రభవిల్లినది.

అముద్రితములైన వీరి సుభాష్చంద్ర బోసు చరిత్రము, వీరభారతీయము మొదలగునవి ప్రబంధములు. ఇవి దేశభక్తిని ప్రకటించు కవితాశిఖరములు. మాతృదేశ మమకారము వీనిలో జాలువారుచున్నది. దేశీయ భావనా విలసితములైనను సమగ్ర మానవ జీవనమునందు ప్రశాంతతను, పురోభివృద్ధిని కాంక్షించుచు దైవభక్తిని అంతస్సూత్రముగా అవిచ్ఛిన్నంగా కలిగియున్నవి. ఈ ప్రబంధములు వెలుగు చూచినచో వారి కవిత్వమకరందము తెలుగు పాఠక లోకమునకు సాహిత్య ప్రియులకు జిజ్ఞాసువులకు అందగలదని నా యభిలాష.

జయదాసురెడ్డి ఈశ్వరార్చన శీలుడు. గురుదత్తమైన రాగపరిజ్ఞానము కృతులలో ప్రభవిల్లినది. భక్తి భావము ప్రధానంగా కలిగిన ఈ కవి పారమార్థిక కావ్యములుగా హరికథలను తీర్చిదిద్దియున్నాడు.

గౌరీ శంకరలీలాతరంగిణి సంస్కృత కీర్తనలతో కూడిన కావ్య రత్నము. కావ్యముయొక్క ఆరంభమున శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన, తల్లిదండ్రులకునమస్కృతి, గురుస్తుతి చేయుటద్వారా కవి వినయములు, ఆచార మమకారమును ప్రదర్శించియున్నాడు. భక్తునిలోని సుగుణములు సైతము ప్రకటితమగుచున్నవి.

గౌరీ శంకరలీలా తరంగిణీ అత్యంత మధురమైన సంస్కృత కీర్తనాత్మక కావ్యము.అద్యంతము సంస్కృతమయమే యైనను సుస్పష్టమయిన భావధార నుద్యుక్తమగుచు ఆనంద ప్రదాయినిగ విలసిల్లుచున్నది.

ఒక కీర్తన చూతము.

మలయమారుతము – ఖండగతి

జయజయ మహేశ, శివ – జయజయ ఉమేశ
జయ జయ సతీశ, భవ–జయ జయగిరీశ ॥

1. పార్వతీరమణ, మృదు పద్మపదచరణ।
పర్వతస్థైర్యఘన - పాపభయ వారణ
॥జయ॥

2. రక్షితా సదృశ మా - ర్కండేయ
పాహి॥
దాక్షిణ్యనిలయ, భక్త కదంబ,
అద్వైహి ॥జయ॥

3. వేదాంతవేద్య, శంభీన సవినోద।
శ్రీదాదిభక్తజన - సేవితాంభోరజపద
॥జయ॥

4. ఉగ్రోగ్ర, నిలయ కా - లోగ్ర
నటరాజ॥
అగ్రహానుగ్రహ, ఉద - గ్రభాస్కర
తేజ ॥జయ॥

5. హాయ మదక కద్మంత, - హాతదురిత
చరిత!
భయరహిత సర్వజ్ఞ, -జయదాసవినుత
॥జయ॥

కవికి గల సంగీత పరిజ్ఞానము ఇందు ప్రదీప్తమగుచున్నది. భగవదర్చన, భగవద్వర్ణన భక్తిభావ ప్రపూరిత సుహృద్భావన ఇత్యాదులిందు ప్రభవించినవి. భగవన్మహిమను వివరించుటకై కీర్తన నాశ్రయించుట శ్రేయస్కరమే. త్యాగరాజు క్షేత్రయ్య వంటివారును భక్తిభావనా మార్గమున ఉత్తమ కవులైయున్నారు. జయదాసు రెడ్డి ఆకోవకు చెందినకవిపుంగవుడు. భక్తశిఖామణి అమోఘ పద సమ్మేళనము, అపూర్వ ఆనంద ఆవిష్కరణాత్మక పాదరచనము వీరికీర్తనలయందు స్పష్టముగా కనిపించు లక్షణములు.

శబ్ద సమ్మేళనమునకొక మచ్చుతునక

అభినంద్య తుహినభూధర-హరివాసవ
గిరిజ
అభి మర్దాంగణభూర్యసి - హతవైరి
సమాజ
అభిఘాతి శమన వందిత - శుభదాంఘ్రి
సరోజ
శుభదాయక సుజనోత్కర-సురకల్పోర్వీజ
॥శరణం॥

'నా ఋషిః కురుతే కావ్యమ్' అని కదా ఆర్యోక్తి. ఋషిత్వము లేనిదే తపశ్శక్తి కలుగదు. తపశ్శక్తి లేకున్నచో కావ్యరచన అసంభవము. మనస్సును భక్తిభావ శిఖరంగా నిలిపి దృష్టిని భగవానునిపై కేంద్రీకరించకున్నచో పైని గల రచనను చేయుట కవికి దుస్సాధ్యమయ్యెడిది.

వారి శ్లోకముల రెంటిని పరిశీలింతము.

శ్లో॥ స్థైర్యాద్రిం; హరిసాయకం;
శ్వశురముజ్ఞధ్వంసి; మత్స్యగ్రభూ
తేశం; మానిజనాశ్రయం;
ప్రతిహాతోదగ్రార్థశాస్త్రోత్కరం ।
కళ్యాణప్రద; మద్వితీయధనురా
చార్యం; మృడానీశ్వరం ।
వందేహం; మడనూర్పురీశ్వర
మతుల్యం రామలింగేశ్వరం ॥

శ్లో॥ వందే భాసుర బాలచంద్రమకుటం-
వందే భవానీశ్వరం
వందే వహ్నిశమాల పత్రలసితం-
వందే జగన్నాయకం ।
వందే స్వర్గధునీధరం భవహరం-
వందే హరం ధూర్జటిం ।
వందే నిర్జరవందితాంఘ్రియుగళం-
వందే గిరీశం, శివం ॥

వారి భక్తివిశేష మెట్టిదోగానీ శ్లోక రచనయందును పరిశుద్ధమైన సుహృద్భావన కలిగియుండుటచేత నాతడు సుశ్లోకుడై యున్నాడు. గురుజనముల ఆశీస్సులు, దైవకృప, జననీజనకుల ఆశీర్వాదముతో పాటు సరస్వతీమాత కరుణకు పాత్రుడయి నాదయోగిగా, కవివరునిగా మునీశ్వరునివలె పరమానందము నందించు శ్లోకము లందించినాడు.

శతకములు :

శ్రీజనంగుల వారు రచించిన శతకములు మూడు ప్రచురణమునకు నోచుకొనినవి. 1. శ్రీ రామలింగశతకము. 2. శ్రీ సోమశేఖర శతకము, 3. శ్రీ శేషగిరీశ శతకము. ఒక్క సోమశేఖర శతకము యొక్క ప్రచురణ కాలము మాత్రమే 1964 గా కానవచ్చుచున్నది. మిగిలిన రెండు శతకముల ప్రచురణకాలము తెలియటంలేదు కాని ప్రతులను బట్టి ఊహించినచో శ్రీ రామలింగ శతకము శ్రీసోమశేఖర శతకముకన్న పాతగ కనిపించుచున్నందున 1964 కు పూర్వము ప్రచురింపబడినదని చెప్ప వీలున్నది. శ్రీ శేషగిరీశ శతకము మాత్రము క్రొత్తదిగా నున్నందున 1985 తర్వాత ప్రచురింపబడినదిగా గ్రహించవచ్చును.

శ్రీ రామలింగ శతకము 'రజతవృషతురంగ - రామలింగ' అను మకుటముతో శివార్పణ నిమిత్తమై రచించినశతకముగా స్పష్టమగుచున్నది. ఇందున్న నూరు పద్యములు భగవానుని (ఈశ్వరుని) స్తుతించుటతో కూడియున్నవి. భగవానుని రూపవర్ణన, క్షేత్రవర్ణన, కార్యవర్ణనలు వీనియందు దలరారుచున్న విశేషములు.

ఉదా: శ్రీమహేశ చంద్ర-శేఖర, కైలాస
వాస, చిద్విలాస-పార్వతీశ
పాపనాశ,యీశ,-పాలిత దివిజేశ
రజతవృషతురంగ-రామలింగ.
నీలకంఠ, విషమ-నేత్రగంగాధరా
భయదశూలపాణి,-భవ్యచరిత
పశుపతీ, విహంగ-వాహనసన్నుతా

మిగిలిన పద్యములలో నీతిమార్గపు టాలోచనలు, లోకరీతివివేచనము, సన్మార్గమునందభిలాష, ధర్మనిరతి ఇత్యాదులు ప్రకటితమయినవి. అవినీతిపై ధ్వజమెత్తుటయు, సంఘమున అవ్యవస్థ నెలకొనుటపట్ల నిరాసనమును ఈ శతకమున కలవు.

శైలివిషయమున నొక విశేషము కలదు. అచ్చతెలుగున ఈ కవి హృద్యమగు పద్యము అల్లినాడు. 'అగలుదెగడ లోఁగి-యుడలుచు జేజేలు/బ్రదికిగొకట డాగి-పడియలందు / నెంత వారికైన నిక్కట్లు దప్పునా' యని రచించిన పట్టున పద్య వైలక్షణ్యము పేర్కొనదగినది.

**శ్రీ సోమశేఖర శతకము :**

ఈ శతకము మార్గఛందస్సులో కూడు కొనిన నూటఎనిమిది పద్యములుగల శతకములు. ఈ నూటఎనిమిది పద్యములు ఛందస్సురీత్యా రెండు రకములుగ విభజింప వీలున్నది. కొన్ని చంపకమాలలు, మరికొన్ని ఉత్పలమాలలు. మానవజీవనము దుష్కరముగ, నీతిబాహ్యముగ ఏర్పడుటకు గల మూలకారణములపై కవి దండయాత్ర ప్రకటించి, మానవుడు నిజమైన మానవీయ సహృదయభావముల కాలవాలమగుట అవసరమని భావించెను.

'కావ్యం యశసేఽర్థకృతే' అని ఆర్యోక్తి. ఈ కవి అవినీతిపై మండిపడుటకూడా ఇందు ప్రదర్శితమగుచున్నది. గోడు భగవానునితో చెప్పుకొనుచున్నను సంస్కార భావము ప్రబోధించు ఉత్తమ ఆవేశమును ప్రదర్శించుచున్నాడు.

ఉదాహరణ :

ఉ॥ నీతినిపీడి ఘోరరజనీ చరతుల్యులు
అంచగొండులు ।
ర్వీతలమెల్ల నొక్కపరి-
మ్రింగఁదలంచి కలంచుచుండ నే ।
రీతి సుఖించులోకము? భరించెడి
కష్టములం దలంచినా ।
చేతుల మ్రొక్కి వేడెదను-
శిష్టులఁ బ్రోవర సోమశేఖరా ॥

చ॥ కులమత భేదభావమునఁ-
గ్రూరమనస్కులు సజ్జనాళికిం
గలుగఁగఁజేసి కష్టములఁ-
గ్రాలుచు నుందురు వ్యాఘ్రతుల్యులై
తలఁపరు పక్షపాతమున-
దైత్యులు మున్ను నశించిరంచు, నో
కలుషహరా! సురాసురులఁ-
గాచెడి దేవర సోమశేఖరా ॥

ఎంతటి సంప్రదాయబద్ధుడైనను ఈ కులమత భేదభావముల సహించుట అసంభవము. అసహజము. 'ఈశావాస్య మిదం సర్వమ్' అనుదానికి సరియైన అర్థము నెరిగిన ఏ మానవుడును హింసను, అవినీతిని వ్యతిరేకించకుండ ఉండలేడు. జయదాసు భక్తుడు. పైగా సంఘసంస్కార భావమును నైతము ఈశ్వరప్రీతి భావముగనే స్వీకరించిన సహృదయుడు. అందువలననే దుష్టభావములను, దుష్టులను, పాపచిత్తులను యీసడించుకొనక యుండలేడు. తను చేసిన లేదా తనవలన జరిగిన తప్పిదములకును ఆత్మవిమర్శ చేసుకొని భగవానునకు సంవేదించుకొంటాడు. తల్లిదండ్రులపట్ల గురువులపట్ల అతని భయభక్తు లసాధారణమైనవి. కవి మనసా వాచా కర్మణా దేని ఆదర్శప్రాయముగ నాచరించినాడో అదియే వ్యక్తపరచుచున్నాడు. ఇది కవిలోని సిన్సియారిటీకి నిదర్శనము.

హరికిని నీకు భేద మిసుమంతయు
లేదని నేనెఱింగి మి
మ్మిరువురఁ గొల్చికొల్చి హరియింపగ
ధైర్యము బాధలంది, ని
న్నరసి మహేశ్వరుండవని,-
యగ్రజుఁ గాచినవాడవంచు నీ
చరణము లాశ్రయించితిని-సాంబశివా!
హర! సోమశేఖరా ॥

ఈ పద్యమునందు కవియొక్క స్థితి మనకు గోచరించుచున్నది. మొదట హరి హరుల నిర్వురను పూజించియున్నాడు. ఇసుమంత భేదమును లేదని తెలియును. ఎవరిని పూజించిన నొకటే యని నిర్ధారించుకొని శివున్ని ఆశ్రయించినాడు. అయినను విష్ణువుపై భక్తిమాత్రము తరగలేదు.

శ్రీ రామలింగ శతకము, శ్రీ సోమశేఖర శతకము- ఈ రెండును శివార్పణ రచనలే. శ్రీ శేషగిరీశ శతక మొక్కటి వేంకటేశ్వరుని స్తుతించుచు వ్రాసినను వారి శ్రీమతియైన కీ॥ శే॥ లక్ష్మీబాయమ్మకు అంకిత మిచ్చినాడు. విశేషమేమనిన మూడు శతకములు నమూల్యములే.

శ్రీ శేషగిరీశ శతకము శ్రీ వేంకటేశ్వరస్వామికి నివేదించుకొనిన విధముగా ప్రతి పద్యముచివరా 'శేషగిరీశా!' అని యున్నది. ఇందు నూరు పద్యము లున్నవి.

క॥ శ్రీకరుడవు, దండిత ద
ర్వీకరుడవు, శుక్రశిష్య-వీరవరజ గ
ద్భీకరుడవు, జయదాస వ
శీకరుడవు, తిరుమలేశ! శేషగిరీశా!

ఇందు ప్రాసవైభవము అసాధారణమైనది. సకలవిధ కందముల నడుపుటయే గాక, యతి సాధనయందును వీరు చేసిన కృషి యమోఘమైనది. సమాసఘటనమున, పలుకుబడి ప్రకటనమున ఈ కవి యొనరించిన పరిశ్రమముద్వారా అతని వ్యుత్పత్తిశక్తిని మన మెఱుగగలము.

తరగలెత్తు దేశీయభావన, ప్రవాహమానమైన జాతీయ జీవన సద్భావనా, అనుక్షణ నవీనత్వము నందించు భక్తి భావనా ఇత్యాదులు గల శ్రీ జయంగు యెల్లమందదాసు (జయదాసురెడ్డి) గారి కవితామకరందము ప్రశంసనీయమైనది. ఈ కవి వాణీకటాక్షముచేత గురువును మించినవాడు కాకున్నను గురువులు మెచ్చెడి నచ్చెడి ఉత్తమ కవీశ్వరునిగా, సత్పురుషునిగా, ఈశ్వరార్చన కళాశీలునిగా వెలుగొందుగాక!

## 2. దండకాలు - చిత్రకవితా విశేషాలు

—శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

(గత సంచిక తరువాయి)

**ఓష్ఠ్యదండకాలు :**

ప ఫ బ భ మ వ ఉ ఊ ఒ ఓ ఔ అక్షరాలతో మాత్రమే రచింపబడినవి. ఇట్టి దండక భాగానికి ఉదాహరణ గణపవరపు వేంకటకవిగారి ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసంలో (882) కలదు.

**గుణితక్రమ దండకం :**

దండకంలో ఏదైనా ఒక అక్షరానికి గుణితక్రమం పాటింపబడి రచించటం ఇందలి చిత్రం. మొదట తలకట్టు, ఆ తర్వాత దీర్ఘం, పిమ్మట గుడుసు-ఈవిధంగా దీంట్లో గుణితక్రమం పాటింపబడుతుంది. ఇలాంటి దండకంలో ఒకేస్వరంపై అకారాదులు వస్తాయి కనుక ఇది వినుటకింపుగా ఉండి అదొక అలంకారంగా భాసిస్తుంది. ముక్క తిమ్మన్నగారి పారిజాతాపహరణంలో, కాణాదం పెద్దనగారి అధ్యాత్మరామాయణంలో గుణిత క్రమపద్యాలున్నాయి. గుణిత క్రమదండకానికి ఉదాహరణ గణపవరపు వేంకటకవిగారి ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసంలో ఉంది. భకారగుణితక్రమంలో చెప్పిన ఆ దండకభాగమిది - 'జయహారి గిరిపా! 'భ'వాకార బోధాగమోద్ధారణా! 'భా'సుభృద్ధుర్య 'భి'న్నేతరాత్మీయ దంష్ట్రా ధృతక్ష్మాతలా 'భీ'మరూపా 'భు'జంగేంద్రవాసస్థ దైతేయరాణ్మస్తసహాదాంబుజా 'భూ'రి రాజన్యమార్జత్కుఠార ప్రభాదేవ చూడామణీ భాస్వద్ధనుర్భంగ బాహాబలా 'భై'రవాంగ ప్రలంబాసురచ్ఛేదనోదారసీరాయుధా 'భో'గమోగీకృత త్రైపురస్త్రైణ పాతివ్రతీభూమ 'భౌ'మ ప్రమూఢైరి సంహారి గంధర్వరూపాధికా 'భం' జితస్థైర్య' - (882) ఈ దండక భాగంలో భకారగుణితక్రమం (భ-భా-భి-భీ-భు-భూ-భై-భో-భౌ-భం) కలదు. ఇది గుణితచిత్రం; ఇందులో మరోచిత్రం కూడా ఉంది. ఈ మరోచిత్రాన్ని ఇదివరకెవ్వరూ ప్రస్తావించలేదు, ఆ చిత్రమేమంటే-ఈదండకభాగం దశావతార స్తుత్యాత్మకం. దండకంలోగల భకార గుణితాక్షరాల సంఖ్యకూడ దశకం; ఇది ఇందలి మరోచిత్రం.

**చలజిహ్వక :**

దండకమందలి ప్రతి వర్ణం కూడ నాలుక కదలించియే చదువబడుతుంది. కనుక దీనికి చలజిహ్వక అని పేరు. ఈ దండకానికొక ఉదాహరణ గణపవరపు వారి ప్రబంధరాజంలో ఉంది. ఆ దండకభాగమిది - 'నారదారాధనా నారదాహ్లాదితానీరదాళీలసన్నీల తేజః శ్రితా సారదైత్యచ్ఛిదా చండచక్రాంకితా శ్రీరసాలంకృతా శేషశైలస్థితా.'

వృత్త్యనుప్రాసాది శబ్దాలంకార చిత్ర

**దండకాలు :**

ఇట్టిదండకాలు తగణ పునరావృత్తి వల్ల తీగలు సాగుతూ రాగరంజితమై తరంగభరితమగు జలనిధి గాంభీర్యం అనుభూయమాన మయ్యేటట్లుంటాయి. సిద్ధ

---

**శ్రీ జవంగుల యల్లమందదాసు (జయదాసు రెడ్డి)గారి రచనల సూచిక**

ముద్రితములు :

1. శ్రీ నాగేశ్వరస్వామివారి స్తోత్రము (5 శ్లోకములు)
2. శ్రీ మడనూరి రామలింగేశ్వర స్తవ శ్లోక సప్తకము (7 శ్లోకములు)
3. మహాలక్ష్మి స్తోత్రము (12 శ్లోకాలు)
4. శ్రీ రాజరాజేశ్వరీ స్తవ శ్లోకాష్టకము (8 శ్లోకములు)
5. మృత్యుంజయ దండకము
6. శ్రీమదాంజనేయ స్తవ శ్లోకరత్నావళి (16 శ్లోకములు_ఒక కీర్తన)
7. శ్రీ వినాయక పూజాపద్యములు (16 పద్యములు_2 శ్లోకములు)
8. శ్రీ తిరుమక్త జ్వాలాముఖీస్తోత్రము(11 శ్లోకములు-ఒక కీర్తన_ఒకదండకము)
9. శ్రీ రామలింగ శతకము
10. శ్రీ సోమశేఖర శతకము
11. శ్రీ శేషగిరీశ శతకము
12. జయదాసు కీర్తనలు, తానవర్ణములు (48 కీర్తనలు_8 తానవర్ణములు)
13. గౌరీశంకర లీలాతరంగిణి (26 కీర్తనలు-మృత్యుంజయ దండకము)
14. శ్రీ సీతారామ కళ్యాణము (హరికథ)
15. శ్రీ రుక్మిణీ కళ్యాణము (హరికథ)

అముద్రితములు :

16. సుభాష్చంద్రబోసు చరిత్రము (ప్రబంధము)
17. వీరభారతీయము (1000 పద్యములు గల ప్రబంధము).

—( ० )—

ప్రశస్తులైన కవులు రచించిన దండకా లిట్టివి చాలకలవు. మచ్చునకు–పోతన–భోగినీదండకము, తాళ్ళపాక తిరుమలాచార్యుల శృంగారదండకం,నందితిమ్మన్న పారిజాతాపహరణ మందలి దండకం, గణపవరపు వేంకటకవి విద్యావతీ దండకం, చెళ్ళపిళ్ళ వరసకవి యామినీపూర్ణ తిలకవిలాసమందలి దండకం, ఝుంఝామారుతం వేంకటసుబ్రహ్మణ్యకవి వేంకటేశ్వర దండకం మున్నగునవి. ఇందు మచ్చునకు ఒక దండకభాగం –'శ్రీమన్మహా దేవదేవా శివా వామదేవా చిదానంద భావా విభాస్వత్ప్రభావా భవాంభోధి సంతారకా తారకాదంబకాదంబగోరాజ గోరాజకాంతాజ కాంతాజ సంతాన సంతాప ఫేనాబ్జ ఫేనాబ్జ మందార కుందార కుందార విందారగనీహార మందాకినీ హార బృందారకాహార హారప్రభాంగా శుభాంగా సభంగాంగ గంగాధరార్ధాంగి సంగీత నాట్యప్రసంగాదరా మంగళశ్రీధర శ్రీధరోచ్ఛృంగ శృంగార సౌధాంతరంగా తరంగాయమానోజ్జ్వలాభంగరంగత్కురంగాగ్రపాణీ...' – (యామినీ పూర్ణ తిలకావిలాసం)

ముక్తపదగ్రస్తదండకాలు :

ముక్తపదగ్రస్తాలై అతిమనోహరమైన రచనా విలాసాలతో నానాలంకార చమత్కార చాతురీవిలాసాలతో– చేయితిరిగిన కవివర్యులు రచించిన దండకాలెన్నో ఉన్నాయి. మచ్చునకు – 'శ్రీ వేంకట క్ష్మాధరోత్తుంగ శృంగాగ్ర నిత్యస్థిరాగారు, గారుత్మతోదీర్ణ సౌవర్ణభూషా విశేషోజ్జ్వలాకారు, కారుణ్య తారుణ్య లావణ్య సారప్రభాసద్మ పద్మాధరాధీర లీలాకరోదార సంసారు, సారూప్య సామీప్య సాలోక్య సంలోక్య సద్భక్త ముక్తప్రజస్తోత్ర పాత్రీకృతాచారు,చారు క్రియాయోగి యోగీశ్వరస్వాంత కంజాత సంజాత సంవాసు సంబంధు, బంధూక బంధూ భవద్భక్త్య నవ్యాధరానేక సల్లాప గోపాంగనాలింగనానూన సన్మాను, మానుష్యలీలా కృతామర్త్య సంతోష సంధాను, ధానుష్కమూ ఖ్యాభిమాన ప్రసూనాస్త్ర సందోహ సౌందర్య సాఫల్య రూపాభిరాజద్విశాలాత్ము, నత్ముల్ల కగ్రీవ దుర్గ్రాహ్య నిగ్రాహ కోదగ్ర చక్రాబ్జచాపాసి సంశోభిహస్తారవిందున్, సదానందు, గోవిందు...'

– (తాళ్ళపాక తిరుమలాచార్యకృత శృంగారదండకం.)

'శ్రీ విశ్వనాథాన్వయాంభోధిచంద్రుండు, చంద్రప్రభాంచత్కపోలాంబుజాక్షీ మణీ పంచబాణుండు, బాణీకృతామేయ...' – (గణపవరపు వేంకటకవి విద్యావతీదండకం)

ఇట్టిదండకాలకన్నింటికీ తొలిప్రత్యేక దండకకృతి అయిన పోతనగారి భోగినీ దండకం మార్గదర్శకం.

ముద్రాలంకార చిత్రదండకాలు :

రచించిన పద్యంలో సందర్భోచితంగా ఆ పద్యం పేరుకూడ ఇమిడిస్తే దాన్ని గూఢముద్రాలంకార మంటారు. ఈపద్ధతి తెలుగులో నన్నెచోడునినుండి వ్యాప్తి చెందింది. దండకాలలో ఇట్టిగూఢముద్రా లంకారచిత్రానికి మచ్చునకో దండకం– భోగినీదండకం. పోతనగారి భోగినీ దండక మందలి గూఢ ముద్రాలంకారచిత్రాన్ని గూర్చి కొంత తెలుసుకుందాం. దండక భేదాలు అనేకం. అందులో 'కామబాణము' అనే దండక భేదం ఒకటి. 'తాగౌకామబాణః' అని హేమచంద్రుడు తన ఛందోనుశాసనంలో (2-399) 'కామబాణ' దండక భేద లక్షణాన్ని చెప్పినాడు. 'ఛందఃశేఖర' మనే లక్షణగ్రంథంలో కామబాణ దండక లక్షణం ఇట్లు చెప్పబడింది– 'పాదే సమస్తే స్తతాగైః కృతః కామబాణాభిధానో భవద్దండకోఽన్తే గయుగ్మం యది స్యాత్' అనియత తగణాలపై రెండు గురువులుండటం కామబాణ లక్షణం. భోగినీదండకం ప్రారంభంనుండి తగణాలతో ఉండి 'ఆచంద్ర తారార్కమై యొప్పచుండున్' అని (చుం, డున్, ఁ) గురుద్వయంతో ముగింపబడింది. కనుక భోగినీదండకం కామబాణదండక భేదలక్షణానికి సరిపోతుంది. ఇక దండకంలో – 'కాకలోలంబులై మోహజాలంబులై కామబాణంబులై యుప్రమాణంబులై' మీనశోభంబులై అని ఏతద్దండకం పేరు కామబాణం అనేదాన్ని గూఢ ముద్రాలంకార శోభితంగా చెప్పబడింది. భోగిని 'కందర్ప బాణాహతిం జెంది లోగుంద 'సింగభూపాలుని ప్రేమించి, చివరకు ప్రేమను సాఫల్యం చేసికొనింది. కనుక పోతన ఈ దండకాన్ని ఉద్దేశ్య పూర్వకంగా కామబాణమనే దండక భేదంగా రచించి ఎంతో ఔచిత్యాన్ని పాటించినాడు. భోగినీదండకం కామ దండక బాణమనీ. అదికూడ ముద్రాలంకారశోభితమనీ, ఇదివరలో భోగినీదండకాన్ని గురించి వ్రాసినవారెవ్వరూ ప్రస్తావింపలేదు.

గణసమదండకాలు :

వీటిని గురించి చెప్పేముందు దండక స్వరూపాన్ని గురించి (ఇక్కడ అవసరమున్నంత) కొంత చెప్పాలి. అదేమంటే_ తెలుగుదండకవాఙ్మయంలో దండకాలు ఏకపాద, ద్విపాద, చతుష్పాదాలుగా ఉన్నాయి. వాటికి ఉదాహరణములు :

ఏకపాదదండకం – 'శ్రీకంఠలోకేశ లోకోద్భవస్థాన ... ... నమస్తేనమః'

ఇది నన్నయభారతారణ్య పర్వంలో గల (1-324) ప్రథమాంధ్రదండకం.ఒకే

పాదంగల దండకం. ద్విపాదదండకం_ (1) 'యదుతిలక జగత్త్రయీ భర్త.... ...జాపతే' (2) 'శరదభ్ర నవపాండ్ర చంద్రప్రభాభాత... సత్యభామాధవా' ఈదండకం నందితిమ్మన పారిజాతాపహరణంలో కలదు (3-38). ఇది ద్విపాద దండకం. చతుష్పాదదండకం_(1) 'జయ జయ జనయిత్రి కల్యాణ సంధాత్రి ... త్వాంభజే' (2) 'భగవతిగుణదీర్ఘ భావోద్భవాం... ...త్వామహమ్' (3) ద్రుహిణగృహిణి మత్స్యపద్మాది......ప్రణిస్యే స్వయమ్' (4) 'భవతు మమసదా శుభం భాతి......నమస్తే నమః' ఇది శృంగార నైషధంలో (4-138) గల చతుష్పాద దండకం. (ఒక్క శ్రీరంగ మహత్త్వంలో భైరవునిది) మాత్రం త్రిపాదదండకం కనబడుతోంది. అది చతుష్పాద దండకమే అయిఉంటుంది. గ్రంథపాతానికి గురియై త్రిపాదదండకంగా అగుపిస్తున్నదని నాఅభిప్రాయం. ఈఅభిప్రాయాన్ని సిద్ధాంతీకరించవచ్చును కూడ. కానిశాఖా చంక్రమణ మగునని ఇక్కడ అట్టి పనికి పూనుకోలేదు.)

గణసమకదండకమంటే పాదాలన్నింటిలోనూ (రెండుపాదాల్లోనూ లేక నాల్గు పాదాల్లోనూ) గణముల సంఖ్య సమానంగా ఉండాలి. దాన్ని గణసమక దండకమంటారు. పారిజాతాపహరణమందలి దండకం గణసమక దండకానికొక ఉదాహరణ. (ఈదండకం రెండో పాదంలో "నొక్కి మక్కించి నల్దిక్కులన్ దేవతా' అనేపాఠాన్ని కొందరు స్వీకరించిరి. అదిసరికాదు 'నొక్కి వేదేవతా' అనేపాఠం సరైనది. అప్పుడే తిమ్మన్న చెప్పినట్లు గణసమక దండకమవుతుంది.) శృంగారనైషధమందలి దండకం అన్ని పాదాలు సమాన దైర్ఘ్యాన్ని కలిగిలేవు. కనుక ఇది గణాసమకదండకం. దీంట్లోని ఒక్కొక్కపాదంలోని గణసంఖ్య ఒక్కొక్కరీతిగా భేదం ఉంటుంది. గణాసమక దండకరచన సులభము. గణసమక దండకరచన పాదాలలోని గణాలు సమానంగా ఉండేటట్లు గణాలను లెక్కపెట్టుకొనిచేయాలి. గణాసమక గణసమక దండకాలేకాక సమగణ దండకాలు కూడ ఉన్నాయి. ఇవి ఒకేపాదంగా కూడ ఉంటాయి. నగణద్వయంపై ఇచ్చవచ్చినన్ని రగణాలుకూర్చితే అది సమగణదండకం అవుతుంది. అంటే దండకం చివరన కూడ రగణమే ఉంటుంది. అన్నీ సమగణాలే. కనుక దీన్ని సమగణదండకం అన్నారు. దీనికి ఉదాహరణగణపవరపువారి ప్రబంధరాజంలో చూడవచ్చును. గణసమక దండకం చిత్రరచనగా చెప్తారు. సుదీర్ఘమైన పాదాలు కలిగి ఉండికూడ అవి సమానంగా ఉంటాయి కనుక ఇది చిత్రరచన క్రింద జమకట్టినారు.

## 2. దండకములు_బంధకవిత

దండకాల్లో కూడ బంధకవిత్వం ఉంది; కానీ చాల తక్కువ. ద్విసప్తతినాగబంధ దండక మొకటి గోదాదేవి స్తుత్యాత్మకముగా కలదు; కర్త_తిరునారాయణకవి. 72 నాగుపాములు పెనవేసుకున్న బంధచిత్రంలో దండకం చెప్పబడింది. ఇంత పెద్దబంధం బంధకవితాప్రక్రియలోనే మరొకటి లేదు. బంధం చివరన ఈశ్లోకం కలదు_ శ్లో॥ ద్విసప్తత్యహిబంధస్య తిరునారాయణకవిః। నాఽన్యోఽస్తి భువనే తుల్యో యద్యస్తి పరిమృగ్యతామ్॥ మరి ఏ కవికూడ ఇంత పెద్దబంధాన్ని రచింపలేదు. ఈ దండకంప్రతి కీ.శే. శ్రీమాన్ విత్రాల శేషాచార్యులవారి చెంత ఉండినది. [వివరములకు చూడు_ సెప్టెంబరు 1988 భారతి పత్రికలోని (పుటలు 14-29) 'చిత్రకావ్యములు' అనే వ్యాసం. కర్త_విత్రాల శేషాచార్యులుగారు.]బంధకవితా ప్రక్రియలోనే 'రికార్డు' సృష్టించిన ఈ ద్విసప్తతినాగబంధ దండకం వెలుగు చూడటం ఎంతైనా అవసరం.

## 3. దండకములు_గర్భకవిత

దండకాలలో ఇతర పద్యాలు, ఇతర పద్యాలలో దండకాలు గర్భితంగాఉండే వాటిని ఈ ఉపశీర్షికలో పరిశీలింతము.

### స్రగ్విణీ_భుజంగప్రయాత వృత్తగర్భిత దండకాలు :

"శ్రీరామచంద్రా! మహారాజచంద్రా! మహీజామనోజ్ఞా! ధనుష్పాహసజ్ఞా! నమత్ప్రేమకారీ! యశశ్శ్రీవిహారీ! సుకాంతా! మహాకాంతికాంతా! యనంతా! హరీ! దేవ! సుగ్రీవమిత్రా!.... .... .... యహో జానకీశా! దయాశ్రీనివేశా! యహో రావణారీ! జయశ్రీవిహారీ! మహీశస్వరూపా! సమస్తాత్మదీపా! మహాత్మ! న్నమస్తే నమస్తే నమః_ (కాణాదం పెద్దన సోమయాజికృత అధ్యాత్మరామాయణం). ఈ దండకంలో స్రగ్విణీవృత్తం, భుజంగప్రయాతవృత్తం గర్భితాలుగాఉన్నాయి. గర్భితస్రగ్విణీవృత్తం : "రామచంద్రా మహారాజచంద్రామహీ_జామనోజ్ఞా ధనుష్పాహసజ్ఞాన మ_త్ప్రేమకారీ యశశ్శ్రీవిహారీ సుకాం_తామహాకాంతి కాంతాయనంతాహరీ." గర్భితభుజంగప్రయాత వృత్తం : "అహో జానకీశా దయాశ్రీనివేశా_యహో రావణారీ జయశ్రీవిహారీ_ మహీశస్వరూపా సమస్తాత్మదీపా_మహాత్మన్నమస్తే నమస్తే" ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసాది గ్రంథాల్లో ఇట్టి గర్భకవితా దండకాలున్నాయి. వృత్తగర్భిత దండకాలన్నీ స్రగ్విణీవృత్త, భుజంగప్రయాత వృత్తగర్భితాలుగనే ఉంటాయి;దండకచ్ఛందస్సులో ఇమిడే లక్షణం స్రగ్విణీభుజంగప్రయాతవృత్తాల్లో ఉండటమే అందుకు కారణం.

### దండకగర్భిత పద్యాలు :

ఇతర పద్యాలలో దండకభాగం గర్భితంగా ఉండటం కూడ కలదు. అట్టి వాటికి కొన్ని ఉదాహరణలు-

సీ. పూతనాదాసుర భ్రాతృసంత్రాణ సూ-
ర్యప్రకాశాకృతీ యప్రమేయ
శేషతల్పాకరస్వీత శంఖారి గాం-
భీర్య వార్ధిస్థితా భీమవంద్య
దంతి రక్షావరాద్వైతమార్గ ప్రభా-
వాత్త చిత్తాధికా యద్రి ధైర్య
కంజనేత్రా శరఖ్యాత జీమూతసం-
కాశ వర్ణాతిగా కంబుకంఠ
గీ. ... ... ...

-(ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసం-807)

పై సీసపద్యంలో గల గర్భితదండక భాగ మిది- "పూతనాదాసుర భ్రాతృ సంత్రాణ సూర్యప్రకాశాకృతీ శేషతల్పాకర స్వీతశంఖారి గాంభీర్య వార్ధిస్థితా దంతిరక్షావరా ద్వైతమార్గ ప్రభావాత్త చిత్తాధికా కంజనేత్రా శరఖ్యాత జీమూత సంకాశవర్ణాతిగా" పై దండకభాగమందున కూడ భుజంగప్రయాత, స్రగ్విణీ వృత్తాలు గర్భితంగా ఉన్నాయి. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసమున గల 879వ సీసపద్యం ఇలాంటిదే. నాదెళ్ళ దక్షిణామూర్తి విరచిత గురుభక్తి ప్రభావము (5-140), మరియు శ్రీహనుమద్రామాయణము-సుందరకాండ (274), విశ్రాల శేషాచార్యకృత శ్రీ వేంకటేశ్వర చిత్రరత్నాకరము (పూర్వభాగం-గర్భ-23)లో గల సీసపద్యాలు దండకగర్భితాలకు మరికొన్ని ఉదాహరణలు. గణపవరం వేంకటకవి, విశ్రాల శేషాచార్యాదులు తమ కావ్యాలలోని దండకగర్భిత సీసపద్యాలను, గర్భితదండకంలో ద్విపద కూడ గర్భితమై ఉండేటట్లు రచించిరి.

చంపకమాల చతుష్కంలో ఇతరమైన పద్యాల నెన్నింటినో రచింపవచ్చునని చిత్రకవి పెద్దన తన 'లక్షణసార సంగ్రహము'లో (3-102-106) లక్షణ, లక్ష్య పద్యములను ఇచ్చినాడు. అట్టి చంపకమాల చతుష్కంలో దండకం కూడ గర్భితమై ఉంటుంది. 'ప్రబంధరాజ శిరోభూషణ శ్రీకృష్ణబలరామ చరిత్ర' అనే గ్రంథంలోకూడ గుడారు వేంకటదాసు ఇలాంటి చంపకమాల చతుష్కాన్ని రచించినాడు. ఇట్టి వాటికి మచ్చునకు-

1. చం. స్మరజయ చారుధామ జయచర్య
భుజాకృతి సాధుగాయకా
హరివాయ యాంజనేయ యన
ఘాత్మ యతీడిత యార్యకల్పకా
హరివాయు హరకీర్తి యరుణాస్య
యభీష్టద యాదికర్మగా
స్వరుశయ సారమూర్తి శమశాలి
సమాదృత సత్సుధీశకా

2. చం. సరసగ శౌరిదాస సముసుఖ్య
యశస్కర సౌఖ్యదాయకా
హరసుత హరిగేయ సదృశాంగ
దయానిధి యాజిభూహితా
హరిబల హరికాయ సుగుణాఢ్య
మహామహ యన్యదారణా
పరబట భారవిక్ర సముపాద
శుభక్రమ భవ్యధీరతా

3. చం. నరనుత సామదారి నదనాథ
నముద్ధన సారపాయకా
వరహరి వారవీర బలవాల వరక్రమ
వైరిభీముజా
ధరశర శారహార ధరతార తరస్వర
ఘాతభారకా
హరిహరి యానసార యసురాసు
భయంకర హారిధారణా

4. చం. గురుబల గోత్రధైర్య గుణకూట
గురుప్రతి గోపవాయుజా
తరుతల దండితాక్షతతచామ తపఃఫల
దక్షనక్రహా
వరబల భానుజాప్త పటుభావ
భయాపహ భాగవర్ణికా
శరశలి కావిరాజి కపికాంత కవత్కవి
గణ్యప్రోవుమీ.

-(లక్షణసార సంగ్రహము)

పై చంపకమాల చతుష్కంలో అనేక ఇతర పద్యాలు గర్భితంగా ఉన్నాయి. అందులో ప్రస్తుతాంశమైన దండకభాగాన్ని మాత్రం చూపింతును- "స్మర జయ జయ గాయకా కల్పకా కర్మగాధీశకా దాయకా భూహితా దారణా ధీరతా పాయకా భీముజా భారకా ధారణా వాయుజా నక్రహా వర్ణికా ప్రోవుమీ." ఇది గర్భిత దండకం. ఈ గర్భితదండకాన్ని గురించి నాదృష్టికందిన మరోవిషయం ఏమంటే- ఈ దండకం పేరు సంగ్రామ దండకం. నగణద్వయంపై పదహారు (16) రగణాలు ఉండే దండక భేదాన్ని సంగ్రామదండకమంటారని తారానాథ తర్కవాచస్పత్యంలో కలదు.' గర్భిత దండకంలో మొదటగల నగణద్వయాన్ని తొలగించిన స్రగ్విణీవృత్తం అవుతుంది కనుక ఈ గర్భిత దండకం స్రగ్విణీవృత్త గర్భితం కూడ.

పరిశీలించేకొలదీ దండక వాఙ్మయంలో అనేక చిత్రకవితా విశేషాలు గోచరిస్తాయి. అందుకే కాబోలు! వార్తాకవి రాఘవయ్య తన 'లక్షణదీపిక'లో దండకాలను చిత్రకవితా ప్రక్రియలందు చెప్పినాడు. దండక వాఙ్మయ సాగరాన్ని బాగా మథించినచో చిత్రకవితామృతం ఇంకా ఎంతో లభిస్తుంది.

దండకాలు మధురకవితాశాఖకు చెందినవిగా విజ్ఞులు చెప్పినారు. అయితే ఆశు-మధుర-చిత్ర-విస్తరములనే చతుర్విధ కవితలుకూడ దండకవాఙ్మయంలో దండిగానే ఉన్నాయి. ప్రస్తుతం దండకాలలోని చిత్రకవితావిశేషాలను కొంత చెప్పికొన్నాం. వీలునుబట్టి మరోసారి దండకాలలోని ఇతర కవితలను గురించి చర్చిద్దాం.

(*.*)

# 3. పానుగంటివారి నాటక రచనా చమత్కృతి

—శ్రీ రాళ్ళపల్లి సుబ్బారావు, ఎమ్. ఏ.,

ఆంధ్ర నాటక వికాసము సంస్కృతాంగ్లానువాద రూపకములగనే తొలుదొల్త సాగినది. తదనంతరము సామాజిక స్పృహగల శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు, శ్రీ కందుకూరి వీరేశలింగం, చిలకమర్తి, గురజాడ, వడ్డాది, వేదం వెంకటరాయశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, తిరుపతి వేంకటకవులు, కాళ్ళకూరి నారాయణరావు మొదలగు మహనీయుల ప్రతిభావ్యుత్పత్తులచే నాటకరచన క్రొత్తవెలుగుతో వినూతన మార్గముల నడిచినది,

"నాటకాంతం హి సాహిత్యమ్", "కావ్యేషు నాటకం రమ్యమ్" అను అభియుక్తోక్తులు రూపకప్రక్రియా వైశిష్ట్యమును వివరించుచున్నవి. ప్రామాణికకవుల కాలమునకు ముందే అనగా కవిత్రయమునకు ముందే కాళిదాసు, భట్టబాణాదులు వెలయించిన సంస్కృత నాటకము లుండెను. కాని కావ్యానువాదములు తెనుగున 18వ శతాబ్ది ఉత్తరార్థం వరకు వెలువడలేదు. అందులకు కారణములు పెక్కుగలవు. పాత్రపోషణకు ననువైన భాష లభింపకుండుట, పండితపోషకులైన రాజుల నిరాదరణ, నాటకప్రదర్శనారంగస్థలములు లేకుండుట, నటులకు సమాజమున గౌరవస్థానము కల్పింపకుండుట కారణములు కావచ్చును.

19వ శతాబ్ది యారంభములో రూపకక్రియా నిర్మాణములో సాహిత్యసృష్టి నారంభించిన ప్రముఖ నాటకకర్త శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. వీరి సాహితీలతకు తొలుత విరిబూసిన విరజాజి నర్మదాపురుకుత్సీయము. ప్రపంచప్రఖ్యాత ఆంగ్లరూపక సృష్టికర్త షేక్స్పియర్ వీరి కాదర్శము. ఈ ఆంగ్లనాటకకర్త వ్రాసినన్ని నాటకములు నిర్మించి, లౌకికప్రపంచము నంతటిని రూపకముల చిత్రించుట వీరి యభిమతము. వీరికి షేక్స్పియర్ యం దెంతటి యారాధనాభావమున్నను వాని రచనల నాంధ్రీకరింప పూనకుండుట విశేషము.

వీరు రచించిన నాటకముల సంఖ్య సుమారు ముప్పది. ఇందు పౌరాణికములు, చారిత్రకములు, స్వకపోలకల్పితములును గలవు. ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావుగార్లవలెనే వీరును కేవలము స్వతంత్రరచనలే గావించిరి. వీరు వారివలె నాటకములందు పాటలను ప్రవేశపెట్టలేదు. పద్యరచనయందును ఆటవెలది, తేటగీతి, సీసములనుమాత్రమే రచించిరి. నాందీపద్యములను వ్రాయునపుడు మాత్రము వృత్తపద్యములను రచించిరి. నాటకములందు పాడుటకనువైన పద్యము లుండరాదని వీరి దృఢమైన యభిప్రాయము.

వీరి రచనయందలి భాష వ్యావహారికమునకు దగ్గఱగా నుండు సరళగ్రాంథికము. ఆ కాలములో సరళగ్రాంథికమున రచనలు గావించిన శ్రీ కందుకూరి, శ్రీ చిలకమర్తి వంటివారి భాషాపటిమకంటె విశిష్టమైనది వీరి భాషారచనావిధానము. ఇది అనన్యానుకరణీయమైనది.

**పానుగంటివారి నాటకలక్షణములు :**

వీరి నాటకములన్నియు నైకాంకికములే. ఏకరంగములే. అందవాంతరరంగవిభజనము లేదు. వీరు ప్రవేశ విష్కంభముల నధికముగ వాడలేదు. సన్నివేశకల్పనము అద్భుతావహమైనది. ఆ యా సన్నివేశములు ప్రేక్షకులలోని కుతూహలమును మరింత రేకెత్తించునట్టివి. ప్రతి సన్నివేశమును పూర్వాపర సందర్భశుద్ధి కలదై ఔచితీభరితమై యుండును. వీరి నాటకములందలి సంవాదకౌశలము ప్రశంసార్హము. ఇందులకు వీరి ప్రతిపాత్ర నిదర్శనమే. సంవాదములందలి ఉక్తివైచిత్రి కొన్ని సందర్భములందు హద్దులు మీరుటయు సంభవించినది. ప్రసంగవశమున నిట్టి వైచిత్రి ఔచితీరహితమై కన్పించును.

దాసజనులచే పల్కించు అసభ్యములు కోకొల్లలు. వీరికి కోతికురుసుతిను, నసభ్యప్రలాపములు నధికము. నాటకములన్నింట ఈ దాసీజనులు నిగ్రహానుగ్రహసమర్థులుగా కాన్పింతురు. ఒకచోట దశరథమహారాజుభార్య కైక, తనవద్దకు భర్త వచ్చునట్లు చేయుమని దాసి నర్థించును. ప్రసిద్ధ నాటకములందే ఇట్టి పాత్రలను ప్రవేశపెట్టిన వీరికి కల్పితనాటకములం దెట్టి యభ్యంతరముండదుకదా !

పానుగంటివారికి షేక్స్పియర్ నాటకము లాదర్శము లైనవి. Restration commedy ల ప్రభావము వీరిపై అధికముగా నున్నది. ఈ కామెడీలలో అసభ్యములకు నశ్లీలములకు నిధానములైన సన్నివేశము లత్యధికములు. పానుగంటివా రెంతటి సంస్కారప్రియులైనను నట్టి అశ్లీలములకు తొలగింపకుండుట వారి వ్యంగ్య హాస్య ప్రీతికి నిదర్శనము. లోపము కన్పించినచోట, అవకాశము దొరికినచోట వీరొక విసురు విసరక యుండలేదు.

వీరికి ఉపమాలంకార ప్రయోగము నందు మిక్కిలి మక్కువగలదు. ఈ యలంకార ప్రయోగము రచయితయొక్క నిశితమైన ప్రకృతిపరిశీలనాశక్తికి నిదర్శనము.

లోకోక్తులు, జాతీయములు వీరి రచనల యందు నత్యధికములు.

తలుచుగా వీరి నాటకములందు దీర్ఘ స్వగతములు కాన్పించును. ఇందులకు నర్మదాపురుకుత్సీయ మొక్క అపవాదము. దీర్ఘ స్వగతములను వీరు పద్యరూపమున కూడా సాగించుట యొక వింత. పాత్ర లచే అపవారించి మాట్లాడించుటకూడ వీరి నాటకములలో అధికము. ఒకటి రెం డపవాదములున్నను పానుగంటి వారి సంభాషణలు ఉదాత్తస్థాయిలో నుండును. ఈ లక్షణము ప్రసిద్ధవిమర్శకులైన శ్రీ పింగళి లక్ష్మీకాంతం ప్రభృతు లచే ప్రశంసింపబడినది'

రంగస్థలమును రెండు మూడు కక్ష్యలుగా విభజించి, యొక ప్రక్క ప్రధాన పాత్రలు మాట్లాడుచుండగ మరొక ప్రక్కనున్న నటుడు వెంటనటివానికి కన్పింపకుండ వాని సంభాషణలు తాను వ్యాఖ్యానించుచుండును. ఆ సన్నివేశము లలో నిది యంత యుచితముగా నుండదు. ఇందుకు నర్మద, కోకిల, రాధాకృష్ణ మున్నగు నాటకములు నిదర్శనములు.

రాధాకృష్ణ నాటకమున రాధ, ఆమె చెలికత్తెలు రంగమధ్యమున మాట్లాడు చుండగ ఒక ప్రక్కనుండి శారదా కృష్ణులు, మరొక ప్రక్కనుండి తరళా సత్యభాములు ప్రవేశించి వా రితరులకు కన్పింపకుండగా వారిమాటలను చెప్పలను విమర్శించుచుండుట. ఈ లక్షణము పెక్కు నాటకములందు తొలుత పాటింపబడి నను, నిందలి అసంభావ్యతను కవిగారు త్వరితగతిని గమనించియే యుండిరి. కావుననే తరువాతి నాటకములలో రంగస్థలము బహుపాత్ర సంకీర్ణము గాకుండుటకై వేరొక క్రొత్తమార్గమును వా రవలంబించిరి. రంగస్థలమున ఒకరిద్దరు పాత్ర లుండగా వారితో భాషించు ఇతర పాత్రలు నేపథ్యమునందే యుండి మాట్లాడును. ఇట్టి పద్ధతి "బుద్ధ బోధ సుధ" అను నాటకమున కానవగును.

మూర్ఖుడి నాటకములను వ్రాసినను పానుగంటివారి పాత్రలు ఒకదానికొకటి పోలియుండక ప్రత్యేక వైశిష్ట్యములు కలిగియుండును. ఇట్టి ప్రత్యేకత వీరి నిర్మాణచాతురికి నిదర్శనము. ఇది వీరి నవ్య మున స్తత్వ పరిశీలనాపాటవము సర్వదా ప్రశంసార్హము. సన్నివేశముల కూర్పు, సంవాదకౌశలము, పాత్రలసృష్టి అను మూడును నాటక విశిష్ట గుణత్రయము. ఇట్టి నాటక లక్షణములు అనితరసాధ్యములు.

వీరి నాటకములు-పరిశీలన :

వీరి "సారంగధర" నాటకము సుఖాంతమైనది. ధర్మవరం రామకృష్ణమాచార్యుల వారి సారంగధరను జూచి, యందలి అస్వాభావికతను తొలగించుటకై వీరు మరల వ్రాసినట్లు కాన్పించును. కల్పిత కథలలో "పూర్ణిమ", "రాతి స్తంభము" అను నాటకములు విషాదాంతము కాక పోయిన తప్పాయములు కల్గినవే.

పానుగంటివారి రచనలలో విశిష్టగుణములు మూడును, దోషములు మూడును గలవని సుప్రసిద్ధవిమర్శకులు శ్రీ నండూరి బంగారయ్యగారు తమ యభిప్రాయము వెలిబుచ్చిరి.

విశిష్టగుణములు :-

1. సహజప్రతిభ 2. సమానత-ప్రకృతి పరిశీలనము 3. ఉదాత్తార్థప్రతిపాదనము.

దోషగుణములు :-

1. నీరసపద్య రచన 2. అసభ్యత 3. ఛాందసపు ధోరణి.

"రాధాకృష్ణ", "విజయరాఘవము", "పాదుక" మొదలగువానిలో పానుగంటి వారు మహోదరాశయములు ప్రతిపాదించి లోకోపకారము గావించిరి. వీరు శ్రీకాకుళదరాజీవములందు భక్తినిబద్ధచిత్తులు. తమ నాటకములలో భక్తిప్రసంగములు, దేవుడు ప్రత్యక్షమగు సందర్భము అందు తన్మయులై, పాఠకులను కూడా తన్మయస్థితికి గొనిపోవుదురు. ఇట్టి నాటకములలో రాధాకృష్ణ తలమానికము.

వీరి రచనలన్నియును లోకకళ్యాణాకాంక్షితములే. కావుననే భరతవాక్యము "లోకా స్సమస్తాః సుఖినోభవన్తు" అని యుండును. తెలుగు సాహిత్యమునకే కాక పాశ్చాత్య సాహిత్యమునందును పానుగంటివారి రూపకరచనా విధానము మేల్తరమైన దని, అధిక సన్మానములను బడయుచున్న కేటర్ లింక్, బెర్నార్డ్ షా, ఇబ్సెన్ మొదలగు రచయితలకంటె వీరి రచనలు కొన్ని ప్రశస్తతరములని గమనింపనగును.

కావుననే కౌలిరచనలచేతనే తిరుపతి వేంకటకవులచే "అభినవకాళిదాసు" అనెడి బిరుదముచే ప్రశంసింపబడినవారు శ్రీ పానుగంటి. నాటక పరిశోధనానుకూలముగా పానుగంటివారు తమ నాటక పీఠికలలో రచనానుక్రమణిక, రచనాకాలములను పేర్కొనిరి. ఈ విశిష్ట గుణము తరువాతి నాటకకర్తలకాదర్శమై, మార్గదర్శకమై భాసించుచున్నది.



# 4. ముత్యాల సరాలు - నవీన స్వరాలు

—'సాహిత్యరత్న' శ్రీ పి. వి. ఎల్. సుబ్బారావు

"The author lives through the reader",[1] ఈ వాక్యాన్ని నిజం చేసిన కవులలో పేర్కొనవలసిన కవి గురజాడ అప్పారావుగారు అన్నది అందరూ అంగీకరించవలసిన సత్యం. తెలుగు కథకు శ్రీకారం చుట్టిన కథారచయితగా, తెలుగు కవితను క్రొత్తదారి పట్టించిన కవిగా తెలుగు సాహిత్యాకాశంలో ధ్రువతారగా నిలిచిన 'కన్యాశుల్కం' నాటక రచయితగా, వ్యావహారిక భాషాప్రయోక్తగా వైవిధ్యం నిండిన వ్యక్తిత్వం గల గురజాడ నిజంగా ఓ తెలుగు జాతి. ఆయన రచనలను చదవని తెలుగు రచయిత, ఆయన మాటలను వినని తెలుగు వారు లేరంటే అది అతిశయోక్తి కానేరదు. అయితే ఆయన రచనలనుండి ప్రభావితం అయి, ఆ దారిలో నడవాలనే అభిలాష కల్గినవారు, నడయించగలిగినవారు ఉన్నారని తెలుగు సాహితీలోకానికి తెలియజేసే నిజయవంతమైన మనోజ్ఞభావానికి మనోహర రూపమే ఈ కవితాసంపుటి "ముత్యాలసరాలు-నవీన స్వరాలు."

సాధారణంగా ఒక పుస్తకంలో ఒక రచయిత ప్రతిభ, అతని ఉద్దేశ్యాలు చోటుచేసుకొని మనకు దర్శనమిస్తాయి. కాని ఒక మనీషిని, అతని ప్రతిభకి స్పందించి అనేక మంది తమ ప్రతిభలను జోడించి వ్రాసిన కవితలలో "పోటీ" అనే "గీటురాయి"కి నిలిచిన తలమానికమైన కవితల సంకలనం, కవితలలో జరిగిన సంఘర్షణకి అక్షర సాక్షాత్కారం. మనోజ్ఞ పబ్లికేషన్స్‌వారి ఈ పుస్తక ప్రచురణ నిజంగా అది గురజాడకు అక్షయ సత్కారం.

ఈ పుస్తకానికి అసలు 'అ' అప్పారావుగారు అయితే 'ఆ' ఆవిష్కర్త అపుద్రగారు అవడం సముచితంగా వుంది.

ఈ పుస్తకంలో బహుమతులు పొందినవి, ప్రచురణకు స్వీకరించబడినవి మొత్తం 27 కవితలు ఉన్నాయి. ఈ కవితలన్నింటిని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

1. ఒకే అంశముపై వివరంగా వ్రాయబడిన కవితలు. ఉదా : స్త్రీ వివాహ సమస్యపై శ్రీ వై. శంకరనారాయణగారి 'కనువిప్పు', బత్తా చంద్రయ్యగారి "కన్యాదానం", పంతుల దక్షిణామూర్తిగారి "నేటి పూర్ణ".

2. వివిధ అంశాలను స్పృశిస్తూ వ్రాయబడిన పద్యాలున్న కవితలు. ఉదా: శ్రీ అయినాల కనకరత్నాచారిగారి "భాషవేదన", డా॥ తెన్నేటి సుబ్బారావుగారి "మేలుకుంటే", బోలోజు వెంకటాచారిగారి "నేటిచదువులు."

ఈ కవితా ముత్యాల మాటకు ముందుమాటను అందించిన శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యంగారి మాట "ఈ కవితలన్నింటిలోను ప్రధానంగా కథకన్నా, వర్ణనకన్నా సూక్తికి ఎక్కువ ప్రాధాన్యత కనిపిస్తుంది,"తో మనమంతా ఏకీభవిస్తాము. అది పుస్తకం మొదటి పేజీలు తిప్పగానే ప్రథమ కవిత "కనువిప్పు" లోనే దర్శనం ఇస్తుంది.

"సకల ప్రాణుల దేహమొక్కటే
బాధలుండనె గాధలుండనె
నిందు ప్రాణము తీయతగునా
జాలి లేకుండన్."

గురజాడ ముత్యాలసరాల్లో వున్న ప్రధాన విషయం సంఘ దురాచారాలను వ్యంగ్యంగా ఖండించడం, తత్కాలీన సమాజానికి ఓ దారి చూపడం. అది గురజాడ అడుగుజాడలో నడచిన ఈ "నవీన స్వరాల్లో" మనకు కన్పిస్తుంది. నేటి మన సమాజం ఈ కవితల్లో మనకు దర్శనమిస్తుంది.

1. వరకట్నం :

కన్నెశుల్కము మాని వరునకు,
కట్నకానుక లిచ్చుచుంటిమి,
కన్నెబ్రతుకుల చేటుగానక
కనులు మూసుక తిరుగుచుంటిమి.

'వేగుచుక్క-భువికి దిగిరా"
—శ్రీ నవనం నారాయణమూర్తి

2. సతి సమస్య :

భర్త చచ్చిన కొంత శోకం,
సతిని చేస్తే పోవునంటూ,
మూఢనమ్మకములకై బలియా
అబల బతుకేదోయ్.

"మనసు చెప్పిన మాట"
—సిహెచ్. వేంకటేశ్వరరావు

3. నిరుద్యోగం :

ఎంత చదివిన ఎన్ని నేర్చిన
లేఖ లేకా ముడుపు రాకా
వయస్సు మీరిన నిరుద్యోగికి
ఎదురుచూచిన జాబు మోళీ.

"మేలుకొంటే"
—డా॥ తెన్నేటి సుబ్బారావు

4. జనాభా సమస్య :

అధిక సంతతి దేశమందున
అవస్థలకు దారితీయును
పరిమితంబై, పౌష్టికంబగు,
నంతు దేశపు టక్కరోయ్.

"మేలుకొలుపు"
-శ్రీ శిష్టా హరగోపాలరావు

ఇదే కవితలో ఉగ్రవాదంగూర్చి, మన బాధ్యతని గూర్చి చెప్పారు.

ఉగ్రవాదం యెక్కడున్నను
జాతి ఐక్యత కుంటుపడునోయ్
దాన్ని నిర్మూలించు భారము
నీదిగా తలపోయవోయ్,

---

1. Literature for an age of science by Hyman Leyy & Helen Spalding.

నేటి రాజకీయ నాయకుల పరిస్థితి "పేగు చుక్క భువికి రా'' లో చక్కగా వివరించ బడింది.

దేశ ప్రేమకు పదవి కాంక్షను
భాష్యమని మది నెంచుకొంటిమి
ఆశ్రితుల కతి మంచి గూర్చుచు
దేశ సంపద దోచుచుంటిమి.

సమాజంలో శాంతిభద్రతలు రావాలంటే ఏమి కావాలో శ్రీ చింతలపూడి సన్యాసి రావుగారు తమ కవిత ''మానవప్రబోధము'' లో వివరించారు.

బుద్ధదేవుని బోధనములను శ్రద్ధతో పాలించి
నప్పుడే శాంతిభద్రత లవని వెలయును
శాశ్వతంబుగ మానవ!

అలాగే పేదరికాన్ని నిర్మూలించడానికి–

''పేదవానిని చూచి గుండెల,
వేదనాభారమ్ము నింపుక,
జాతికవితలు పాడు టొక్కటే
జాల దేనాడున్.''

''కవితారీతులు''
–శ్రీమతి యమ్. రాజ్యలక్ష్మి

మరి పేదరికానికి సమాధానము "విశ్వ గీతి"లో శ్రీ సావయ్యశాస్త్రిగారు ఇస్తున్నారు.

"ధనమేగా ఇంధనము జగతికి
కృషిని సల్పగ కరువులుండున్.''

నేటి మన పార్టీల తీరుపై 'భాష పేరున' కవితలో శ్రీ అయినాల కనకరత్నాచారిగారు–

మతము కొక జాతీయపార్టీ,
కులము కొక ప్రాంతీయపార్టీ,
పుట్టి పెరిగిన దేశ మెట్టుల బాగుపడునోయ్.

నేటి చదువులసారం,అది కేవలంభారం,ఒక విధంగా ఘోరం అంటున్నారు శ్రీ పోలోజు వెంకటాచారిగారు 'నేటి చదువులు' కవితలో

నేటి చదువులు సైద్ధు మదువులు
కట్న మహోలకు దొడ్డిద్ద దారులు
సిఫారసులకు, బరువులకు అవి
తలలు వంచిన శాంత మూర్తులు.

మనిషి సంఘం మారాలంటూ,గోల చేయ డం కాదు, ముందుగా తాను మారాలని అదే శిస్తున్నారు 'మెరుపుదాడి'లో ఉమ.

మారన లేని సంఘమంటూ
మాటిమాటికి కేకలేలా,
సంఘమంటే నీవు కావా? తెలుసుకోలేవా?

సమాజంలో మనిషి ఉన్నంతకాలం 'దేవుడు ఉన్నాడా!లేడా!' అనేది చర్చనీయాం శమైతే 'దేవుడు' అనే విషయంపై గురజాడ 'మనిషే దేవుడు' అంటాడు. పతివాడ రామా రావుగారు తమ కవిత 'స్నేహ మొక్కటే శాశ్వతము'లో ఏమంటున్నారో చూద్దాము.

దేవుడు కలడటంచును,
దేవులాడకు సోదరా! ధర
జీవకోటినే దాగియుండును,
సేవచేయుట నేర్చుకో.
దేశమంటే మట్టికాదోయ్,
దేశమంటే మనుషులోయ్

అన్నాడు గురజాడ.

ఆ మనుషులు మేలుకొంటేనే పురోగమ నం అంటున్నారు శ్రీ తెన్నేటి సుబ్బారావు గారు. వ్యవహారికభాషతో పాటు ఈ సంకల నంలో గ్రాంథికభాషాప్రయోగం కన్పిస్తుంది.

నీ దృగంచల కాంతి హేలలు
నాదు జీవ వికాస లీలలు
నా మనోజ్ఞ మృదూక్తి నైపుణి
నా మనమ్మున రాగవర్షిణి.
–''హాసహేల''

అనుబంధ ''ముత్యాలసరాలు'' నిజంగా ఈ సంపుటికి మనకి మరింత రాగబంధాలు. ఈ అనుబంధ సరాల్లోని శ్రీ ఎ. గోపాలరావు గారి పద్యాన్ని శ్రీ జి. సుబ్రహ్మణ్యం గారు తమ ముందుమాటలో సంపుటికి భరత వాక్య మని ప్రశంసించారు.

కందపద్యము కవిబ్రహ్మకి,
సీసమది శ్రీనాథు స్వంతము
ఆటవెలదికి హక్కు వేమన
అప్పరాయని జాతి ముత్యాల్
తెలుగుతల్లికి క్రొన్నగల్.

శ్రీ పాత్రోగారు తమ కవిత 'వెలితి'లో వెలితిలేని మనిషి ఉండడని, అయితే వగచ డం తగదంటున్నారు.

వెలితి లేనిదే విలువ తెలియదు
వెలితి కలదని కలత కూడదు
వెలితిలేని ప్రసూతి దెవరో
తెలిసికో నాలా!

''ముక్తకంఠం'' కవితలో శ్రీ వి. కాశీ దాసుగారు 'దైవమన్నది సత్యమైతే, ధైర్య ముగ సత్యమునే నమ్మమా' అంటూ ఓ సత్యాన్ని వచించారు!

''సహజ ప్రకృతివైపు'' అనే కవితలో శ్రీ ఎస్. వెంకటేశ్వరరావుగారు భరతఖండ సంస్కృతీ సాంప్రదాయాలను స్మరిస్తూ నేటి స్థితిని వర్ణిస్తున్నారు.

పేదప్రజల ఆర్తనాదం,
స్వార్థశక్తుల నగ్నసత్యం
దారిదోపిడి, విలువదోపిడి,
నోట్లపేరిట కోట్లదోపిడి

మానవత్వంవైపు మరలమని హెచ్చరిస్తు న్నారు.

ఈవిధంగా ఈ కవితాసంపుటి, పద్యానికి ప్రభావం తగ్గిన ఈ రోజుల్లో భావచిత్రణకు, నేటి సమాజస్థితి వర్ణనకు చక్కని సాధనమని మరోసారి నిరూపించింది.

సాహిత్యానికి సాంకేతిక విజ్ఞానం తోడ యితే క్రొత్తసొగసులు రాగలవని ''కంప్యూ టర్ ప్రోసెసింగ్''లో జరిగిన ఈ పుస్తక ముద్రణ ఓ ఉదాహరణ. దీనికి ఆభరణంగా 'చిత్రకళా శిరోభూషణ' శ్రీ అంట్యాకుల పైడిరాజుగారు వేసిన గురజాడ అప్పారావు గారి ముఖచిత్రం ఈ పుస్తకానికి అమరింది.

గురజాడవారి ప్రేరణతో సృజియించ బడిన ఈ కవితల సంపుటిని వారికి అంకిత మిచ్చి మనోజ్ఞ పబ్లికేషన్స్‌వారు ధన్యులయి నారు. రచయితల రచనలతో వ్యాపారమే ప్రధానంగా భావించే నేటి పబ్లికేషన్ సంస్థ లకు ఓ ఆదర్శం చూపించారు.

చివరిగా, "A writer creates writers among his readers" అనే వాక్యాన్ని నిజంచేసే కొద్దిమంది కవు లలో గురజాడ ఒకరని, వారు ఆంధ్ర సాహితీలోకంలో నిజమైన ''వెలుగుజాడ'' అంటూ ఈ సమీక్షను పూర్తిచేస్తున్నాము.

( * * * )

# 5. హృద్యమైన పద్యం - దాని నేపథ్యం

—శ్రీ బండారు మన్మథరావు

పసుపుమ నూనె రాచి పసిపాపకు
వెచ్చని నీరుపోసి యుం
పెవగ మయాలమంచి మది హెచ్చిన ప్రేమమ
జోలపాట సం
తసమున పాడునట్టి మగనాలి సుఖంబె
సుఖంబుగాని ఏ
పిసుగులు లేని జీవితము విష్ఫలమేగద
జీవితేశ్వరా!

పద్యంలో 'జీవితేశ్వరా' అనే పదాన్ని ముందుగా తీసికొంటే జీవితానికి ప్రభువైన వాడా! స్వామీ! ప్రభూ! అని అర్థాలు స్ఫురించగలవు. 'జీవితేశ్వరా' అనే పదాన్నే ఆధారంగా గ్రహించి ఈ పద్యం ఎవరు ఎవరితో పలుకుతున్నారో ఊహించవచ్చు.

1. భార్య తన భర్తతో సంతానంలో ఉండే సుఖానుభూతిని గూర్చి చెబుతున్నట్లు కనిపిస్తుంది.

2. ఎవరో ఒక వ్యక్తి భగవంతునితో సంసారం (సంతానం) పై ఉండే కాంక్ష వెలిబుచ్చుతున్నట్లుగా తెలుస్తుంది. (పసి పిల్లల బాగోగులు చూసేది సామాన్యంగా స్త్రీలు. కనుక స్త్రీకి ఎక్కువ ప్రాధాన్యత నీయవచ్చు. "మగనాలి సుఖంబె సుఖంబు" అనే మాటల్నిబట్టికూడ స్త్రీకే వర్తింపచేయ వచ్చు. అంతమాత్రాన పురుషుడు కాదని అనుకోకూడదు.)

స్వామీ! పసివానికి పసుపు నూనె వ్రాసి, వెచ్చనినీటితో స్నానం చేయించి, ఆనందంతో ఉయ్యాలలో పుంచి, ప్రేమతో జోలపాట పాడినటువంటి మగనాలియొక్క సుఖమే సుఖముగాని ఎట్టి శిశువులులేని జీవితం వ్యర్థ మే గదా" అనే భావం స్పష్టంగా వెల్లడి అవుతుంది.

పద్యంలో అర్థంగాని పదాలంటూ ఏమీ లేవు. అన్నీ తేటతెల్లమైన తెలుగు పదాల పొందిక. పదాల పుష్పాలు పరిగెత్తుకు వచ్చి చంపకమాలగా ఏర్పడ్డాయనిపిస్తుంది.

ఇంతటి హృద్యమైనపద్యం ఎవరు వ్రాశా రంటారా? పేరు మూలా పేరన్నశాస్త్రి. నేడు ఆంధ్రసరస్వతికి మేడ కడుతున్న మేటి మేస్త్రి. పదాధిక గ్రంథాలు వ్రాసి అలసట యెరుగని మహామనీషి. విజయనగరంనివాసి.

శ్రీ శాస్త్రిగారి కావ్యాలన్నీ పరిమళంతో కూడిన పుష్పాలైతే సన్మానకరించే తెల్లని మల్లె 'భద్రాద్రిరామదాసీయం' వానిలోను రాశిలోను ఉత్తమమైంది. పై పద్యం అందు లోనిది.

యావదాంధ్రంలో రామదాసుగా ప్రసిద్ధుడైన కంచెర్ల గోపన్నయొక్క జీవిత గాథను 'రామదాసీయంగా' రసవత్కావ్యంగా తీర్చి దిద్దా రీకవి. లింగన కామాంబలు గోపన్న (రామదాసు) తల్లిదండ్రులు. సంతానంలేని కామాంబ తన భర్తయైన లింగన్నతో వేదనా పూరితంగా పలికినదీ పద్యం. శ్రీ శాస్త్రిగారు ఆంధ్రసరస్వతికి పెట్టిన నైవేద్యం.

శాస్త్రిగారి కృతులు ముద్రణాభాగ్యానికి నోచుకొన్నవి సుమారు నలభై వరకు వున్నా యి. అందులో యాభైమంది అరవైవరకు శతకాలే కావడం విశేషం. తన జీవితకాలంలో శతశతకాలు పూర్తిచేస్తారంటే అది అతిశ యోక్తి కాదేమో! ఇన్ని కృతుల్లోకూడ ఒక దానికొకటి విలక్షణం కన్పిస్తుంది. భద్రాద్రి రామదాసీయం, అనార్కలి, స్వాతంత్ర్య వీరుడు, ముకుందమాల ఇత్యాదులు కావ్యాలు కాగా, సూర్యనారాయణ శతకం, వేంకటే శ్వర శతకం, సాయి శతకం మొదలైనవి శత కాలు. ఈ కవి తన కావ్యశరీరాల్ని భక్తి రసంతో పోషించడానికి నిశ్చయించుకొన్నట్లు కన్పిస్తుంది.

సున్నితమైన, సరళమైన పదజాలంతో చెప్పదలచుకొన్న విషయం నేరుగా పఠిత యొక్క హృదయంలో చొచ్చుకొనేలా కవి త్వాన్నల్లగల రీకవి. ఆయన కావ్యాలన్నిటి లో ఇతివృత్త నిర్వహణ, రసపోషణ, పాత్ర చిత్రణ, ఛందస్సౌందర్యం, అలంకార వైభ వం, శయ్యాసౌభాగ్యం, భాష-శైలి మొదలగు కవితాసామగ్రి పుష్కలంగా నిండిఉంటాయి.

ఎన్నో కావ్యాలు వ్రాసినప్పటికి శాస్త్రి గారు కవిలోకంలో మరుగునపడ్డ మాణిక్యం. 'భద్రాద్రిరామదాసీయం' కావ్యంపై బెంగు ళూరు విశ్వవిద్యాలయంలో ఎం. ఫిల్. పట్టం కోసం పరిశోధన చేయడమైంది. శాస్త్రిగారి సమగ్రసాహిత్యపరిపస్యపై పరిశోధన చేయవల సిన అవసరం ఎంతైనా వుంది. జిజ్ఞాసులైన పరిశోధకులు పూనుకొందురుగాక!

— 0—

## ఎక్కడ నీ చిరునామా?

—S.V.S: సాయిప్రసాద్, M.A.,

ఓ కలియుగ దైవమా
ధనమా!
ఎంతమంది
కడుపులు కాల్చేశావ్!
ఎంతమంది
మెడలు విరగొట్టావ్!
ఎంతమంది
గోల్డ్ మెడల్స్
తాకట్టు పెట్టించుకొన్నావ్!
నువ్వొట్టి కాగితానివే అయినా
నీ చుట్టూ ప్రపంచాన్నే
పరిభ్రమింప చేసుకొంటున్నావ్!
ధనమా!!
ఇంతకీ
నీ చిరునామా
ఎక్కడ???

( 0 )

# 3. మన భారతం (పుస్తక సమీక్ష)

—శ్రీ కె. మార్కండేయులు

'మంచిపుస్తకాన్ని మించిన స్నేహం లేద'న్న సూక్తి అక్షరసత్యం అనిపిస్తుంది శ్రీ జి.వి.బి. నరసింహారావుగారి 'మన భారతం' పద్యకావ్యం చదువగానే, శ్రీ జి.వి.బి. నరసింహారావుగారి పూర్తి పేరు గరికపాటి వెంకటబసవ నరసింహారావు. ప్రస్తుతం మనకు పరిచయం అవుతున్న "మనభారత" పద్యకావ్యరచయిత కిది తొలిప్రయత్నంగా అనిపిస్తోంది, 'త్వర గా చదివించగలిగే' మంచి పుస్తకానికి ఉండవలసిన లక్షణం ఈ పుస్తకానికి ఉంది. ప్రస్తుత సభ్యసమాజంలోని సమస్యల నెత్తిచూపి పరిష్కారం తెలియజేసి ప్రబోధాత్మకమై ముగింపు నిచ్చిన ఈ పద్యకావ్యంలో 18 పర్వాలున్నాయి. ఒక్కొక్క పర్వంలో పద్దెనిమిది పద్యాలున్నాయి. సిరిసంపదలతో తులతూగే భారతదేశం విదేశీయుల ఆక్రమణలకు గురియాడంతో మొదలుపెట్టి స్వదేశీయుల పాలనలో ప్రజలు పడుతున్న అగచాట్ల వరకు చక్కని పద్యాలతో భారతాన్ని కళ్ళముందు నిల్పిన శ్రీ జి. వి. బి. చేయి తిరిగిన పద్య రచయిత అనడంలో సందేహంలేదు.

వెంకటరమణమ్మ, వెంకట సూర్యనారాయణ మహోదయుల పుణ్యాలపంటగా జనియించిన శ్రీ నరసింహారావు గారు ఎం. ఎ; ఎంఫిల్ పట్టాలుపొంది ప్రస్తుతం గుంటూరులోని 'శ్రీ వెంకటేశ్వర బాలకుటీర్" సంస్థలో అధ్యాపక వృత్తి సాగిస్తూ సాహిత్య పఠనరచన పోషణాదులందు అభిరుచి చూపిస్తూ అవధాన విద్యయందు ఆసక్తిని చూపుతున్నారు కూడ.

(సూడువదులలో కానుభవంతో చూచి చలించిన సమస్యలకు పరిష్కారం ఆలోచన చేసి చేసి మథనపడి యీ కావ్యం రచించి' నట్లు, 'నిర్నిద్రహృదయమథనం నుండి యీ మనభారతం ఆవిర్భవించిం ద'ని కవి తన హృదయాన్ని వెల్లడిచేస్తా అంటారు ముందుగా. "ఇది మహాభారత మంత పెద్దరచనకాదు." 'చుట్టూరాఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకన్న ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్న యినా వెలిగించడం మంచిదన్న' యువభారతి సూక్తియందు నాకు నమ్మకముందన్నది కవి హృదయంలోని మాట. తనదృష్టిలో 'పద్యప్రక్రియ నిత్యనూతనమైనదన అది ఎటువంటి ఆధునిక భావాలనయినా శక్తిమంతంగా వ్యక్తీకరించగలదని, కాకపోతే పద్యరచయితలు కొంత చాదస్తాన్ని వదిలిపెడితే ఇతర ప్రక్రియారచయితలతో తులతూగవచ్చని' అంటూ ప్రక్రియ ఏదైనా సుత్కృయ కావా అంటారు" ఎంత చక్కని భావన.

ఈకావ్యరచనాకాలం 1985-86 అని కవి పేర్కొన్నా 1988 ఆగష్టులో ఇది "గరికపాటి ప్రచురణల" పేర ప్రచురింపబడ్డానికి కొద్దికాలం ముందుగారచించిన కొన్ని పద్యాలు కూడా ఇందులో చేర్చినట్లనిపిస్తుంది.

మనభారతాన్ని కవి మనకు చూపిస్తున్నవరుసఇది. 1 ఆదిపర్వం 2 ఉద్యమపర్వం 3 స్వతంత్రపర్వం 4 దారిద్రపర్వం 5 ఉద్యోగపర్వం 7 అవినీతిపర్వం 8 అనాచారపర్వం 9 మతపర్వం 10 స్త్రీ పర్వం 11 సంసారపర్వం 12 దురభ్యాస పర్వం 13 కళాపర్వం 14 రాజకీయ పర్వం 15 అధికారపర్వం 16 అభివృద్ధి పర్వం 17 పరిష్కారపర్వం 18 ప్రబోధ పర్వం.

ఆదిపర్వంలో 'శ్రీకరమై జగజ్జనవశీకరమై' అంటూ భారతమాతకు ప్రాక్తి ఐక్యతలో నిల్పి శత్రుదుర్భేద్యమై ఉన్న హైందవరాజలోకం విలాసిదేశీ ఆక్రమణలకు తావిచ్చిందో తెలియజేస్తూ 'భరత మేదిని' 'ఎత్తువారింటి బిడ్డయై ఓ త్రిగిల్లిం ద'ని అంటారు. బ్రిటిషువారు మనరాజ్యాన్ని ఆక్రమించారన్నపుడు "ధరణిని ప్రొద్దుకుంకని విధమ్మున 'రాజ్యమాక్రమించారని పేర్కొంటూ 'గుడ్డిలో మెల్లగా వారుచేసిన సౌకర్యాలను పేర్కొన్నారు. ఆ నివృత్తిపాత విమర్శ కావ్యమంతటా మనకు కనిపిస్తుంది. కడజాతి వారని ఆకాలంలో సంఘం వెలివేసిన వారిని మతం పేరుతో మభ్యపెట్టారన్న సందర్భంలో 'పాదములందు పుట్టిరను భావముచే వెలివేయబడ్డ సోదరభారతీయులని పేర్కొనడం 'పద్భ్యాగుం శూద్రో అజాయత' అను వేదవాక్యం ఆధారంగా అన్నట్లనిపిస్తుంది 'సతీసహగమన నిరోధక చట్టంచేసి వందుకు బ్రిటిషు ప్రభుతను' మెచ్చుకొంటారుకవి.

రెండవదైన ఉద్యమపర్వంలో స్వాతంత్ర్యసిద్ధికోసం ఒక అల్లూరి, మాగోకజోను, ఇంకొక భగత్. తిలక్, గాంధిల వంటి మహాత్ముల త్యాగాలను పాఠకులో కానికి గుర్తుచేసి జలియన్ వాలాబాగు దురంతాన్ని కళ్లముందు నిల్పి(ఉప్పుసత్యాగ్రహాన్ని ఒప్పుగా చెప్పి క్విట్టిండియా ఉద్యమం పట్టుతెల్పి" అహింసతిరమ్మగా సంభవించిన స్వతంత్ర భారతావనిని కనుల ఎదుట సాక్షాత్కరింప జేస్తారు శ్రీ జి. వి. బి.

స్వాతంత్ర్యం సంపాదించుకున్న భారతస్థితిగతులను చెప్పనారంభిస్తూ మూడవపర్వం స్వతంత్ర పర్వం ప్రారం

భించి జవహరునాయకత్వం, మహాత్ముని త్యాగం, పొట్టిశ్రీరాముల ఆత్మత్యాగం, శాస్త్రి శాంతికాముకత్వం, ఇందిర ఎమర్జన్సీ, జనతా విగపట్లు, మాజీప్రధాని రాజీవుని నిర్వాహకత్వం వర్ణించారు. పొట్టిశ్రీరాముల ఆత్మత్యాగాన్ని చెబుతూ 'ఏమహనీయుడో తనువుసియాక నేడియూ తీరదక్కటా!' అని చక్కగా సమర్థిస్తారు. ఇందిర అనంతరం రాజీవుని ప్రధానిచేసారన్న విషయం 'సాజం బౌగతి నిందిరమ్మ కొడుకే సమ్రాట్పదం బెక్కె' అని యీదేశానికి పట్టిన దౌర్భాగ్యం వంశపారంపర్యపాలనన్నది వ్యంగ్యంగా అంటారు. ఇక్కడే కాదు వీలైన చోట్లల్లా ఈ వంశపారంపర్య పాలనని ఖండించారు కవి. పరిష్కారపర్వంలో 'జవహారువంశమే భరతజాతికి దిక్కగుచున్న రీతి మానవచరితమ్ము వందొక వినాశహేతువు' అని సాహసంతో అనడం ప్రశంసనీయం.

దారిద్ర్య పర్వంలో 'నలభై వత్సరాల వాసంతంగా' గొప్పలు చెప్పుకొనే యీ స్వతంత్ర భారతంలో దరిద్రం తాండవిస్తోందో విశదీకరించారు. రైతులు తిరువతి వడ్డీకి తిప్పలుపడి అప్పులు తెస్తున్నారనడం ఎంత చమత్కారం. అసలు అప్పు తీరదు. వడ్డీలు చెల్లించేసరికే వారి జీవితాలు చెల్లిపోతాయన్నది వ్యంగ్యం. 'తెలుపు తెలుపోని రంగురంగుల వస్త్రాలను కొనికూడా ధరింపకుండా అర్ధనగ్నంగా తిరిగే విలాసినీ మణులు కొందరైతే జానెడుగుడ్డను నోచుకోని బాలికలు కొందఱు" అని దేశపరిస్థితిని చూపిస్తారు.

విద్యాపర్వం ప్రారంభిస్తూ విద్యారణ్యంలో ప్రవేశానికై తెవెల్గుయత్నించినా సద్యోగభంగం తప్పదంటారు. నేటి విద్యా విధానాన్ని నిరసిస్తూ.... ....

"పాఠాలుతావని పంతుళ్ళ నడుగగా,
విద్యార్థి తప్పని విసుగుకొంద్రు
చదువేల రాదని చవటల నడుగగా,
గురువులేరారని గొణుగుచుంద్రు
గద్దింపరేమని కన్నవారినడుగ,
సర్కారు తప్పని సణుగుచుంద్రు
చదువిదేనాయని సర్కారు నడుగగా,
వారు ఖర్చులు చెప్పి జారుకొంద్రు
'.... ...

అంటూ అందరిదీ సమంగా దోషం ఉందని ఎత్తిచూపుతారు.

లక్షలు సీటుకోసం లంచమిచ్చి చవటలు డాక్టర్లు, ఇంజనీర్లు అయి రోగుల్ని చంపడం, కట్టకముందే వంతెనల్ని కూల్చడం చేస్తున్నారని ఎత్తిపొడుస్తారు.

ఉద్యోగపర్వంలో లంచానివున్న స్థానం తెలియజేస్తూ "వికటపు సత్యమీ భువిని విత్తమొసంగిన మొద్దు పెద్దయా" అనడంకన్న లంచగొండులను వేరెచీవాట్లెందుకు? "చచ్చు గుమాస్తాజీవితం సంద్రం ఈదుటగా' ఈతని తలుస్తారు.

అవినీతి పర్వంలో అవినీతి అంతటా పేరుకుందని అంటూ

"ఇందుగల రందులేదను. సందియ
మేల యవినీతి సర్వోపగతం
బెందెందు వనికిపోయిన,నందందేయుండు
కొత్త ఆకారములో'

అని పోతన భాగవతంలోని పద్యానికి పేరడీగా వ్రాస్తారు.

అనాచార పర్వంలో అంటరానితనాన్ని, కట్నాలను. జంతుబలిని, దయ్యాలు భూతాల్ని వరకట్నాన్ని నిరసిస్తారు. 'ఘనమని కన్నబిడ్డలను కాసుల కమ్మగ సిగ్గులేదాకో" అని చీవాట్లేస్తారు. పెండ్లిండ్లలో చేసే దుబారా, తద్దినాల పేర చేసే ఖర్చు కూడా వీరి విమర్శకి గురయ్యాయి.

మతపర్వంలో జతగా జీవించడమే మంచి మతమని చెప్పి కరుణక్రీస్తు నుండి శాంతరక్షరహీమునుండి, మిత్రరక్షణ కృష్ణుని నుంచి నేర్చుకోవాలంటారు.

స్త్రీపర్వంలో నేటి భారతనారి పడుతున్న అగచాట్లని వర్ణించారు. 'మద్యసేవనంలో మత్తెక్కి భార్యవండిన సాంబారులో కారం ఎక్కువయిందన్న వంటి సాకుతో భార్యల్ని హింసించే ప్రబుద్ధులున్నా'రంటారు.

'సంసార పర్వంలో' దంపతులు సుఖశాంతులతో జీవించాలంటే కుటుంబ నియంత్రణ పాటించడం అనివార్య మని అంటారు. ఇక్కడే కాదు వీలైనచోట్లల్లా కుటుంబసంక్షేమకార్యక్రమాలకు చక్కని ప్రచారం ఇచ్చారుకవి.

దురభ్యాసాలకు దూరం కమ్మని ప్రబోధిస్తూ పొగత్రాగేవారిని ఇలా హెచ్చరిస్తారు.

'నగజాపతి విషభక్షణ, తగజేయుకమూంద
కొంతధారుణి కలిపెన్
భగభగ పొగాకు మొలిచెను,
పొగత్రాగినవాడు గుండెపోటునచచ్చున్'

ఈపద్యం గురజాడ గిరీశం పద్యం 'ఖగపతి అమృతము తేగా' అనే దానికి పేరడీ అని వేరే చెప్పక్కరలేదు.

లలిత కళలన్నీ నానాటికీతీసికట్టన్నట్లు దిగజారుతున్నాయని వాపోతూ 'శ్రామికుల శ్రమ అంతరంప చేసేది, దోపిడీ కెదురు చెప్పేశక్తి నిచ్చేది' అసలు కళ అంటారు కళాపర్వంలో.

రాజకీయపర్వంలో పాదపూజలు చేయించుకొనే నాయకుల్ని నోట్లకుఓట్లు కొనే వారిని చీల్చి చెండాడినట్లు దుయ్యబట్టారు. పక్షపాత రహితంగా పేరు పేరున ప్రతిపార్టీ వారిని విమర్శించడం వీరి సమభావానికి ప్రతీక.

అధికారం చేజిక్కించుకున్న నాయకులు 'ఏరు దాటి తెప్పతగలేసినట్లుగా' ప్రజలకిచ్చిన వాగ్దానాలను మర వ్యవహరిస్తున్నారని అధికారపర్వంలో అంటారు.

పరిష్కార పర్వంలో ముందు చూపిన సమస్యలకు తనకు తోచిన రీతిని పరిష్కారం చూపించారు. అంతకు ముందు జరుగవలసినంత అభివృద్ధి జరుగలేదని అంటారు అభివృద్ధిపర్వంలో. ధరల పెరుగుదలే అభివృద్ధిపర్వంలో పొందింతని వ్యంగ్యంగా అంటారు.

కవి చూపిన పరిష్కారాలు కొన్ని. 1. సమిష్టి వ్యవసాయ పద్ధతి అవలంబించడం విద్యావిధానం బాగుచేయడానికి అందరూ శ్రద్ధ వహించడం స్వయం ఉపాధికి యువకులు యత్నించడం, వనితలు తమ కాళ్ళమీద నిలబడే శక్తి సంపాదించడం మేధావులు రాజకీయాల్లో కాలిడడం మొదలైనవి.

సోదర సోదరీ మణుల్ని ప్రబోధిస్తూ ప్రబోధపర్వంతో కావ్యం ముగిస్తారు.

'జయమ్ము నిశ్చయమ్మురా విచార మింక
వీడరా
భయమ్ము పాతిపెట్టి దేశభక్తితోడ
సాగరా
రయమ్ముగా హయమ్ము వోలె రాజసమ్ము
చూప ని
ర్భయమ్ముగా నరాచకమ్ము పారద్రోలు
సోదరా'

అనే రీతిలో పంచచామర వృత్తంతో ప్రబోధించారు కవి.

అలంకారిక శైలి పుష్టిగా ఉన్న యీ కావ్యంలో సామెతలు,లోకోక్తులు సందర్భానుసారంగా వాడబడ్డాయి.1-చిక్కని పాలలో విషము చిల్కినయట్లు, 2 ఎత్తువారింటి బిడ్డరో ఒత్తిగిల్లు, 8 మీసాలపై తేనియలు 4 చొచ్చెదుదాకను సోమలింగమున్ చొచ్చిన రామలింగమను' 5 ఏరుదాటి తెప్ప నేర్చెడి చందాన వంటివి ఇందులో కొన్ని.

పోతన, జాషువా, శ్రీశ్రీ. కరుణశ్రీ వంటి కవులు ప్రయోగించిన పదబంధాలను కొన్నిటిని గ్రహించి పద్యరచన గావించారు కవి.

'ఇంతింతై జనులింతయై మరియు తామింతై"... ఇత్యాది పద్యం అభివృద్ధి పర్వంలోనిది చూడగానే పోతన 'ఇంతింతై వటుడింతయై "అనేపద్యం జ్ఞప్తికి వస్తుంది. అలాగే ఇందుగలడందులేడను సందియమేల యువనీతి' అనే పద్యం పోతన 'ఇందుగలడందు లేడను' పద్యానికి పేరడీగా అన్పిస్తుంది.

స్వతంత్ర పర్వంలోని ఈ పద్యం చూడండి.

'తలచిన తలపులనలయక; తలపగ వలె
తాతతలపు, తలపగ నేలా
తలపడు తలపులు తలపక; తలపులను
తెరచి తలపుమహింసన్'

ఇందు
'అడిగెదనని కడువడి జనునడిగిన' అనే సర్వలఘు కందంఛాయలు కన్పిస్తాయి.

అలాగే గుఱ్ఱం జాషువాగారి 'ఎన్నో ఏండ్లు గతించిపోయినవిగానీ' అనే పద్య భాగాన్ని మార్పుచేయకుండా ప్రయోగించారు. బలిజేపల్లివారి సత్యహరిశ్చంద్రలోని పద్యభాగం 'అరయన్ వంశము నిల్వనేగద వివాహం' బన్న దానినికూడ వాడారు. ఇలాగే మరికొన్ని చెప్పవచ్చు.

కఠినమైన సంస్కృత సమాసాలు ఎక్కడో కాని వీరి రచనలో కన్పించవు. ఛందో వైవిధ్యంగల పద్యాలు. ముఖ్యంగా ప్రబోధపర్వం పంచచామరవృత్త భూయిష్ఠం. ఉత్పల మాలికను 5 పాదాలతో స్త్రీపర్వంలో చెప్పారు.

ఇక చక్కనిముఖపత్రం 'భావస్ఫోరకంగా కవి తన కలాన్ని బాణంగా చేసి భారతావని అంటే ఏమిటో ప్రశ్నగుర్తుగా మిగిలిపోకుండా అసలు స్వరూపం భేదించి చూపినట్లుగా ముఖపత్రరచన 'శిరి' తమ్మా సత్యనారాయణగారు ఊహించిచేసి ఉండవచ్చు.

ఇంతచక్కని పుస్తకానికి ముద్రారాక్షసుని బాధతప్పలేదు పాపం. కాని 'మన్నించండి' అంటూ పేర్కొన్న తప్పొప్పుల పట్టికలోను తప్పు దొర్లడం గమనార్హం. ఇంతచక్కని పుస్తకం నేటి రోజుల్లో కేవలం 5 రూ॥కు దొరకడం విశేషం.

ఈరచయితతో పరిచయం పెంచుకోవాలన్నా పుస్తకాన్ని కొని చదివి ఆనందించాలన్నా శ్రీ జి. వి. బి, నరసింహారావు బి. ఎల్. (తెలుగు) శ్రీ వేంకటేశ్వర బాలకుటీర్, శ్యామలానగర్ గుంటూరు - 522006 అనే చిరునామాకు యత్నించవచ్చు.

ఈ'మనభారతం' ఆధునిక పద్యకావ్య రచయిత శ్రీ జి. వి. బి. నరసింహారావుగారితో కలంస్నేహం ఏర్పడటానికి ప్రధానకారకులైన విజయభావన శ్రేయోభిలాషులు విజయనగరం శ్రీ విద్య ట్యూషన్ సెంటరు ప్రిన్సిపాలు అయిన శ్రీ ఎస్. కె. పద్మనాభన్ గారికి,వారి సతీమణి శ్రీమతి సీతగారికి 'విజయభావన'హృదయ పూర్వకంగా ధన్యవాదాలు అర్పించుకుంటోంది.

ఈపద్యరచయితకలం ఇలామరికొన్ని మంచికావ్యాలనందించాలని కోరుకుందాం.



## 9. తెలుగుదండక సాహిత్యసూచి

(గత సంచిక తరువాయి)

72. సుబ్బారావు, మార్గాని, సాయిబాబాదండకము. రాజా ప్రెస్, రాజమండ్రి; 1950
73. సూరకవి, అడిదం, శ్రీరామదండకము. సమాలోచన (సాహిత్యపత్రిక) ఏప్రియల్; 1939 రాజమండ్రి
74. సూర్యనారాయణ, కామవరపు. శ్రీ గజాననదండకము, ఎస్. ఎస్. ప్రెస్, భట్నవల్లి, ద్వి. ము. 1952
75. సూర్యనారాయణ, గద్దం. ఆంజనేయదండకము. సారస్వతనికేతనం, వేటపాలెం. నెం. 444,294,5/10670
76. సోమశేఖరరావు, పింజల. శ్రీచౌడేశ్వరీదండకము. సారస్వతనికేతనం ప్రింటింగ్ ప్రెస్. ప్ర. ము. వేటపాలెం, 1960
77. సత్యనారాయణ, అచంట. రామలింగేశ్వరదండకము. శ్రీ మదాచంట రామలింగేశ్వర శతకము. ఆఖరిపుట. కలారత్నాకర ముద్రాక్షరశాల, ప్ర. ము. చెన్నపురి; 1896
78. హనుమంతరాయశాస్త్రి, వల్లూరి. పుష్కరదండకము, మనోరమా ముద్రాక్షరశాల, ప్ర. ము. ఏలూరు: 1908
79. హనుమంతరావు, బాపట్ల. శ్రీ సాయిబాబా దండకము, శ్రీ సాయిబాబా పూజా స్తవములు, చెరువు పోస్టు, సాయినిలయం, 1932
80. హనుమంతరాయడు ఊటుకూరి, పొగాకుదండకము. ఆంధ్ర సాహిత్య పరిషత్తు, తాళపత్ర ప్రతి.
81. హేమాద్రి రంగేంద్రుడు. వేంకటేశ్వర దండకము. వేంకటేశ్వర లఘుకృతులు, పుట. 151-158
82. సాంబకవి, మదురుపాటి, చంద్రాననాదండకము, ఆంధ్ర పరిషత్పత్రిక. 1924 సంపుటం, 13
83. సాంబశివ, వేంకటప్పకవులు. జగదంబాదండకము. శ్రీ కనకదుర్గాస్తోత్రమాల, వాణీముద్రాక్షరశాల, ప్ర. ము, బెజవాడ: 1913

### -: కృతికర్తలపేర్లు తెలియని స్వతంత్ర దండకములు ఉపలభ్యములు:-

1. మాతృశ్రీ అనసూయాదేవి స్తవం (దండకం) విజయా ప్రెస్, ప్ర. ము. విద్రుద్రోలు. 29-12-1960
2. శ్రీశైలభ్రమరాంబా దండకము. కన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాల, బాపట్ల; 1930
3. శివదండకము. ,, ,, ,,
4. నేతదండకము. ఆధునికయుగము - గాంధీ సాహిత్యము (వ్యాసం) నిడదవోలు వేంకటరావు. ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, ప్రమాది, పుట, 18,19
5. పొగాకుదండకము, గౌతమీగ్రంథాలయము, రాజమండ్రి. నెం. డి. 21058
6. కచ్చిరంగరాజదండకము. అసమగ్రతాళ పత్రప్రతి. (అముద్రితం) ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడ, నెం. డి. 67
7. భీమేశ్వరదండకము. భీమేశ్వర పురాణము. చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి పీఠిక, సరస్వతీ పవర్ ప్రెస్, ప్ర. ము. రాజమండ్రి: 1958

## 10. ఒక్క క్షణం....

—శ్రీ ధూర్జటి వెంకటబాబు

ఒక్కక్షణం
ఊపిరి ఆగిపోయినస్థితి
ప్రాణాలు కోల్పోయిన మానసికస్థితి
ఎదలోపల
లోలోపల
శరీరం పిడచకట్టుకొన్నట్టు
శ్వాసనం పూర్ణంగా ఆగిపోయినట్టు
ప్రాణాలు అరచేతిలో బట్టుకొని
గిరగిర ....
గిర్ ... గిర్ ... గిర్ ...
ఘిర్ ... ఘిర్ ... ఘిర్ ....
బయట హోరుమన్న గాలులు
ఫెళ ఫెళమంటూ వృక్షాలు కూలినట్టు....
పెద్దశబ్దాలతో ఇల్లు కూలిపోతున్నట్టు....
భయంకరమైన కారుచీకట్లో
సముద్రం ఒక్కసారి పొంగినట్టు
భూమ్యాకాశాలు ఏకమైనట్టు
కళ్ళుపొడుచుకొన్నా కానరాదు
కుండపోతగా వర్షం
వర్షంలో తడుస్తున్న మానవాకారాలు
పశువులు
గూళ్ళల్లో ముడుచుకొన్న పక్షులు
మనుషులకు ఇళ్ళు కూలితే
పక్షులకు చెట్లు కూలితే
జనంఒక్కసారి
ప్రభంజనంగా మారినా
ఉవ్వెత్తుగా లేచే సముద్రపు హోరుకు
మస్తిష్కంలో మథన పడుతూ
చేసేదిలేక
చెయ్యలేని నిస్సహాయస్థితి
చేయిపెట్టుకొని చూచినా
కనీసం దీపం కూడా
కళ్ళకు కనిపించదు.
మిల మిలా మెరిసే
మనిషి కళ్ళు తప్ప

అట్ల దండకములు. తెలుగులో తిట్టు కవిత్వము, రావూరి దొరసామిశర్మ. పుట. 123-125.

ఓటుదండకము. హాస్యతోరణము. సంపా, బొల్లాప్రగడ సత్యనారాయణమూర్తి. పుట. 172-175, లేదా గోలకొండపత్రిక. 24-5-1934.

0\. శ్రీకనకదుర్గా దండకము. వేకరణ; కంచిరాజు కృష్ణమూర్తి, సరస్వతీపవర్ ప్రెస్, రాజమండ్రి.

11\. వెంకటపతిరాయలదండకం. First Bulletin of Oriental Manuscript Library, Madras, 1948. by Nidadavolu Venkata Rao.

ఇంకా, ప్రచురణ సంస్థలు, సంవత్సరము మొదలైన కపిసవివరాలైన తెలియకుండా ప్రచురింపబడి శిథిలావస్థలో వున్నవి చాలాఉన్నాయి. ఇవి సూర్యనారాయణ, వేంకటేశ్వర, శ్రీరామ, హనుమ, శ్రీకృష్ణ, సాయిబాబా మొ॥ న పేర్లతో ఉన్నాయి.

### -: అముద్రిత స్వతంత్ర దండకములు – ఉపలభ్యములు :-

\- తంజావూరు సరస్వతీమహలు -

1. రాఘవాఖ్యుడు, రాజగోపాలదండకము. నెం. డి. 423.
2. పేరు తెలియదు. దండకము. (దండకానికి పేరులేదు) డి. 422
3. ,, రామదండకము, డి. 424.
4. ,, వెంకటపతిరాయల దండకం. డి. 425
5. ,, శాహరాజదండకము. డి. 426
6. ,, సూర్యదండకము. డి. 848.

### -: ఆంధ్రసాహిత్య పరిషత్తు గవర్నమెంటు మ్యూజియం–కాకినాడ :-

1. సుబ్రహ్మణ్యశాస్త్రి, గరుడాద్రి, శ్రీ శృంగేరివిద్యా నృసింహభారతీంద్రస్వామి దండకము. వ్రాతప్రతి. నెం. 262/20
2. రామయ్య, దేవరకొండ, పద్మపి దండకము. వ్రాతప్రతి. నెం. 262/20.
3. పేరు తెలియదు, హనుమద్దండకము. నెం. 99/20
4. ,, దండకములు, నెం. 321/20. (శిధిలావస్థలో)
5. ,, పుష్పశైలప్రభాదండకము. తాళపత్ర ప్రతి. నెం. 137
6. ,, ఆంజనేయదండకము. ,, నెం. 12.
7. ,, కాళికా దండకము. ,, నెం. 213
8. ,, ఒంటిమిట్ట దండకము ,, నెం. 205
9. ,, నామగిరిలక్ష్మీదండకము. ,, నెం. 171
10. ,, ఆర్యాపురనాథ దండకము. ,, నెం. 171
11. ,, పాగాకు దండకము ,, నెం. 83
12. ,, మీనాక్షి దండకము. ,, నెం. 130
13. ,, శక్తి గణపతి దండకము. ,, నెం. 130
14. ,, రమాకాళిందీ దండకము. ,, నెం. 205

—(సశేషం)—

మూగ సైగలు తప్ప
మనిషికి తోటి మనిషి కూడా కరువే!

* * *

హోరు తగ్గింది
ప్రభంజనం ఆగింది
ప్రాణాలు నిలబడ్డాయి కొన్ని
నిద్రనుండి లేచి చూస్తే
కొన్ని కళ్లు చూస్తే
కొన్ని కళ్ళు చూడలేదు
విరిగిన కొమ్మలు
కూలిన చెట్లు
కోల్పోయిన ప్రాణాలు
ఎన్ని.... ఎన్నెన్నో....
ఎన్నో ... మరెన్నో ....
చరిత్రను తిరగేసినప్పుడు
రాజ్యాల కోసం యుద్ధాలు జరిగాయి.
మహావీరుల ప్రాణాలు మట్టికరిచాయి.
మారణహోమాలు జరిగినట్లు చరిత్ర చెప్తుంది.
మనుషుల మధ్య నెలకొన్న ద్వేషాలు
రాగద్వేషాలతో మనుషులు అంతమైనా
కరుడుగట్టిన ఈర్ష్యాసూయలు రాజ్యమేలినా
జనం నశించడం
మరణాలు సంభవించడం
ఆదిలేదు - అదాలేదు
కానీ
మనిషికాటుకన్నా
పాముకాటుకన్నా
ప్రకృతికాటు
ఎంత బలమైంది?!
ఎంత బలీయమైంది .... ...
అందుకే
అక్షణం
ఒక్కక్షణం
సుదీర్ఘమైన సాధావిలివితంలో
మరలారాకద్దని
ప్రకృతికే కైమోడ్పులర్పిస్తా.
( ** )



# అసలైన యుగాది



తే. ప్రజలచే నేలఁబడు చున్న రాజ్యమందు
ప్రజల మాటకుఁ బెద్దగా వలదు; సుంత
విలువ యున్నచోఁ బెద్దం గలదు పందు;
అప్పుడే యసలైన యుగాది మనకు.

తే. గురులు తండ్రులు, శిష్యులే కూర్మి పుత్రు
లనెడి భావమ్ము హృదయమ్ములందు వెలుఁగఁ
బాఠశాలలె వాణీనివాసములగు;
అప్పుడే యసలైన యుగాది మనకు.

తే. కట్న కండూతి మనలోనఁ గలికమునకుఁ
గానరాకుండ పోయిన క్షణమునుండి
చిట్టిచెల్లెండ్ర బ్రతుకులు చివురులెత్తు;
అప్పుడే యసలైన యుగాది మనకు.

తే. చైత్ర శుద్ధ పాడ్యమినాఁడు జరుపుకొనెడి
యీ యుగాది మనకుఁ గాదు; ఈ ప్రకృతికి;
నరులలో మానవత వెల్లివిరియవలయు;
అప్పుడే యసలైన యుగాది మనకు.

—శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి, ఎం.ఏ.,ఎం.ఫిల్.

సమాలోచన 4,5,6,7,8,9,10,11,12 వార్షిక సంపుటముల వెల వరుసగా 20, 20,12,15,15,15,15, 20
20 రు. లు ఎం. ఓ. చేసినవారికి ఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోస్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

- సంపాదకుడు.

Editor, Printer and Publisher B. Ravikanth, Printed at B. V. & Co., Press,
TyagarajaNagar Rajahmundry - 1.